# కురుక్షేత్రం

శ్రీ రామధారీసింహ్ 'దినకర్'

# కురుక్షేత్రం

(పూర్ణ కావ్యం)



హిందీ మూలం:

జ్ఞాన్‌పీఠ్ బహుమతి గ్రహీత పద్మభూషణ్

**రామధారీ సింహ్-దినకర్**

తెలుగు ముక్తచ్ఛంద కావ్యానువాదం

**శ్రీ చావలి రామచంద్రరావు (సమతారావు)**

ఆచార్య శ్రీ **భీమ్‌సేన్ నిర్మల్** గారి

భూమికతో

**కళాకేళీ నికేతన్ (ప్రచురణాలయం)**

**పిఠాపురం : 533 450**

ప్రథమ ముద్రణ : **విశాలాంధ్ర ప్రచురణాలయం**

విజయవాడ - 2

ప్రచురణ నెం. 307.

ఆశ్వయుజం 1880; అక్టోబరు 1958

ద్వితీయ ముద్రణ : **కళా కేళీ నికేతన్** (ప్రచురణాలయం)

పిఠాపురం : 533 450 (ఆం.ప్ర)

ఫోన్ : 252208

హక్కులు : **శ్రీ చావలి రామచంద్రరావుగారివి.**

ఎడ్రస్ : **ఆత్మానంద నిలయం** (వృద్ధాశ్రమం)

పిట్టలవాని పాలెం (P.O) 522 329

గుంటూరు జిల్లా.

వెల : **30 రూ.**

సోల్ డిస్ట్రిబ్యూటర్సు :

**విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌస్**

**బ్యాంకు స్ట్రీట్ - అబీడ్స్,**

**హైదరాబాద్ - 1**

**కళా కేళీ నికేతన్**

**పిఠాపురం : 533 450**

**ప్రజాశక్తి ప్రచురణలు**

**అశోక్‌నగర్, హైదరాబాద్ -20.**

# ప్రకాశిక

శ్రీ చావలి రామచంద్రరావు తామ్రపత్ర గ్రహీత. ఫ్రీడం ఫైటర్‌గా ఉపకారవేతనం పొందుతూ భార్యా సమేతంగా ప్రస్తుతం వృద్ధాశ్రమమైన ఆత్మానంద నిలయం (పిట్టలవాని పాలెం, గుంటూరు జిల్లా) లో కాలక్షేపం చేస్తున్నారు. కాంగ్రెస్‌వాదిగా 1942 ఉద్యమంలోనే జెయిలుకు వెళ్ళి, జెయిలులో కమ్యూనిస్టుగా మారి, బయటకు వచ్చి, ఉపాధ్యాయ రంగంలో పనిచేశారు. "ఉపాధ్యాయ" పత్రికా సంపాదకులుగా కొన్ని దశాబ్దాలపాటు వ్యగ్రతతో సేవలందించారు. పత్రికా రచన కోసం ఆటం, క్రాంతిరేఖ, ఎక్స్‌రే, గుండుసూది, నగారా వంటి చిల్లర కలంపేర్లతో అనేక రచనలు చేశారు. కాని, సమతారావు అనే లేఖినీ నామంతో బాలసాహిత్యం విరివిగా రచించారు.

శ్రీ చా.రా. కొల్లిపర కుమారస్వామి, అనసూయమ్మ గార్ల పుత్రుడుగా కనగాలలో జన్మించారు. గుంటూరు జిల్లా తెనాలి తాలూకా కొల్లిపర వాస్తవ్యులు చావలి రామయ్య, పద్మావతమ్మ గార్లు దత్తత స్వీకారం చేసుకోగా వారి పుత్రులై పెరిగారు. అనువంశికంగా లభించిన దేవాలయ అర్చకత్వం చేస్తూ ఫోర్తుఫారం పాసయ్యారు. జాతీయోద్యమ ప్రభావంతో హిందీ చదవనారంభించి రాష్ట్ర భాషా ప్రవీణ, ప్రచారక్‌లో పట్టా పుచ్చుకున్నారు. గ్రేడ్ 1 హిందీ పండిట్‌గా ఉద్యోగం సంపాదించుకుని 1955 నుంచి 84 వరకూ నెల్లూరు, ప్రకాశం జిల్లా హైస్కూళ్ళలో పనిచేసారు. ఆరంభ యౌవనదశనుంచీ గాంధీజీ, పొట్టి శ్రీరాములు గార్ల మార్గదర్శకత్వంలో పనిచేశారు. పదిహేనవ యేటనే బాలభారత విద్యార్థిగా నెల్లూరు శాఖ విద్యార్థి ఫెడరేషన్‌లో సభ్యులయ్యారు. 1942లో క్విట్ ఇండియా ఉద్యమంలో పాల్గొని నిషేధాజ్ఞలు ఉల్లంఘించారు. పదిహేడేళ్ళ వయసులో అరెస్టయి అల్లిపురం సెంట్రల్ జెయిల్లో ఆరు మాసాలు కఠిన కారాగార శిక్ష అనుభవించారు. ఆ కారాగార వాసంలోనే కమ్యూనిస్టు నాయకులతో పరిచయం ఏర్పడి, కమ్యూనిస్టు సాహిత్యం చదివి, అభిమానించి పార్టీసభ్యులయారు. జెయిల్ నుంచి విడుదలయాక కమ్యూనిస్టు ఉద్యమంలో కార్యకర్తగా, వివిధ ప్రజాసంఘాల కార్యకలాపాలలో భాగస్వామ్యం పొందారు. ఇటు రచనా వ్యాసంగం చేస్తూనే గ్రంథాలయోద్యమంలో కృషి చేసారు. చిన్ననాటనే ఏర్పడ్డ సాహిత్యాభిరుచి పఠనాభిలాషను పెంపొందించింది. ప్రజా ఉద్యమాలలో పనిచేస్తూనే రచనా వ్యాసంగం కొనసాగించారు. ఆంధ్ర అభ్యుదయ రచయితల ప్రథమ మహాసభ (తెనాలి) లో పాల్గొని సభ్యత్వం స్వీకరించారు. ప్రజా ఉద్యమ స్ఫూర్తితో అసంఖ్యాక గేయ రచనలు చేసారు. కొన్ని

గేయాలకు సముచిత ప్రచారమూ లభించింది. మున్షీ ప్రేమ్‌చంద్ నవల 'మంగళసూత్రం'గా అనువదించారు. ప్రేమ్‌చంద్‌గారి కథలు అనువదించిన తొలి అనువాదకులలో ఒకరు. ఈ రెండు గ్రంథాలునూ విశాలాంధ్ర ప్రచురణాలయం విజయవాడ వారు ప్రచురించారు. శ్రీ గోపాల్ ఠాకూర్ అనే విప్లవ రచయిత రచించిన "భగత్‌సింగ్ జీవితము, అభిప్రాయాలు" అనే గ్రంథాన్ని అనువదించారు. ప్రఖ్యాత హిందీ కవి రామ్‌ధారీ సింహ్ 'దినకర్' గారి శాంతి ప్రేరేపక కావ్యం కురుక్షేత్రంను వచన కవితగా అనువదించగా విశాలాంధ్ర ప్రచురణాలయం వారే 1957లో గ్రంథంగా ప్రచురించారు. 167 పేజీల సుదీర్ఘ ఫ్రీవెర్స్ కావ్యం తెలుగులో ఇదే మొదటిది.

ఉపాధ్యాయ వృత్తిలో ప్రవేశించిన వెంటనే టీచర్స్ ఫెడరేషన్‌లో సభ్యత్వం స్వీకరించారు. ఆ ఉద్యమ కార్యకర్తగా పనిచేయనారంభించారు. ఉపాధ్యాయ పత్రికకు రచయితగా, సహాయ సంపాదకులుగా, ప్రధాన సంపాదకులుగా ఇరవై ఐదు వత్సరాలు పనిచేసారు. ఆ దశలోనే సెప్టెంబరు ఐదూ వింటావా? అనే వచనకవితా వ్యాసం రచించారు. సమైక్యోద్యమ ప్రబోధ గీతాలు ప్రచురించారు. రాజకీయ రచనలను అటుంచి, బాలసాహిత్య నిర్మాతగా శ్రీ చా.రా పరిగణనీయమైన కృషి సల్పారు. తెలుగుపూలు అనే నూటపదిహేడు ముత్యాల సరాలులో చక్కని గేయకావ్యం రచించారు. గేయరచనలో చక్కని లయ, కవితా విన్యాసం సాధించుకున్నారు. వీరి కురుక్షేత్ర కావ్యం నన్ను 57 నుంచీ ఆకర్షించి ఉండడం వల్ల, శ్రీ పరకాల పట్టాభి రామారావు రచించిన కమ్యూనిస్టు పార్టీ చేసిన సేవ అనే గ్రంథంలో వీరిపేరు ఉండడం చూసి, అడ్రస్ సంపాదించుకుని, ఒకే ఒక్క ప్రతి భద్రంగా దాచుకున్నది వారి వద్దనుండి తెప్పించుకొని ఆసాంతం చదివి ఆనందించాను. ద్వితీయ ప్రపంచ సంగ్రామానంతరం సుస్థిర శాంతిమయ జీవితం ఎంత అవసరమైందో నేటికీ అదే పరిస్థితి ప్రపంచ వ్యాప్తంగా ఉంది. అమెరికన్ సామ్రాజ్యవాదులు, వారి జో హుకుందారులైన విస్తరణ వాదులు ప్రపంచంలోని అనేక దేశాలలో కుటిలవ్యాజంతో యుద్ధాలు చేస్తూనే ఉన్నారు. పచ్చని సంసారాలను భస్మీపటలం చేస్తూనే ఉన్నారు. ఈ సందర్భంలో రామ్‌ధారీ సింహ మహాభారత యుద్ధానంతర స్థితిని ఇతివృత్తంగా స్వీకరించి రచించిన కురుక్షేత్ర కావ్యావసరం నేటికీ మిక్కుటంగానే ఉందనిపించింది. భీస్మపితామహులు అంపశయ్యపై శయనించి, తనను చూడడానికి వచ్చిన ధర్మజాదులకు ప్రజలు శాంతిమయంగా కలిసిమెలసి జీవించడం ఎంత అత్యవసరమో ప్రబోధించడం, ఈ ఆధునిక కావ్యంలో ప్రధాన అంశం. కనుకనే ఈ ద్వితీయ ముద్రణ వెలువర్చమని వారిని ప్రోత్సహించాను. వారి వృద్ధాప్య జీవితాన్ని సతీమణితో సహా పిట్టలవానిపాలెం, ఆత్మానంద నిలయంలో గడుపుతున్నారు. కొడుకులు, కూతుళ్ళూ వాళ్ళ బ్రతుకులు వారు బ్రతుకుతున్నారు.

సమతారావుగా రచించిన బాలసాహిత్యంలో 1. పాపల్లారా, 2. చిన్నారి పాటలు, 3. పసిడి పలుకులు, 4. తెలుగు వెలుగులు, 5. గేయకథలు, 6. వెలుగుపూలు, 7.కాంతిపూలు అనే గ్రంథాలకు అవార్డులు లభించాయి. తెలుగు బాలరచయితల సంఘం స్వర్ణోత్సవ సందర్భంలో హైదరాబాదు ఆంధ్ర మహిళా సభ హాలులో సన్మానం అందుకున్నారు. వృద్ధాప్య ఉపాధిగా లభించిన ధనం నుంచి ఇరవై ఐదు వేలు బ్యాంకులో కేటాయించి సమతారావు అవార్డు అనే పురస్కారం అభ్యుదయ రచయితల కోసం ఏర్పాటు చేశారు. గుంటూరు జిల్లా గ్రంథాలయ సంఘానికి ఆ విధి నిర్వహణ బాధ్యత అప్పగించారు. ఈ విధంగా ఫలప్రదమైన సంఘజీవిగా శ్రీ చావలి రామచంద్రరావు సార్థకులయ్యారు.

ఈ ప్రవేశికలో నేను శ్రీ దినకర్‌గారి మూలకావ్యాన్ని గాని, చా॥రా గారి అనువాద సౌందర్యం గానీ విశేషంగా చెప్పదల్చుకోలేదు. మొదటి ప్రచురణలోనే ఉభయ భాషలలోనూ నిష్ణాతులైన పుట్టపర్తి నారాయణాచార్య ప్రభృతులు వివరించి ఉన్నారు. ఈ కావ్య ప్రథమ ముద్రణ నన్నెంతో ఆకర్షించి ఉండడంవల్లనే ఈ కావ్య ద్వితీయ ముద్రణకు ప్రోత్సహించాను. జయేతిహాసంగా పిలవబడుతున్న మహాభారతం కురుక్షేత్ర యుద్ధంతో కురువంశానికి సర్వనాశనమే కలిగించింది. యుద్ధాలలో విజేతలనుకున్నవాళ్ళు బడాయికి పోవడమే తప్ప, లోపల్లోపల ఆ యుద్ధ ఘాతాల బాధకు విలపిస్తూనే ఉంటారు. నిష్కారణంగా ఇరాక్‌పై విరుచుకుపడ్డ నికృష్ట యుద్ధోన్మాది తనదేశంలో ఎందరో సతీసుతులకు తీరని దుఃఖమే ప్రసాదించాడు. నేరస్థుడై బ్రతుకుతున్నాడు. ఈ పరిస్థితి ప్రతి యుద్ధానంతరమూ ప్రతిదేశంలోనూ సంభవించేదే!

ఆరంభ యౌవనం నుంచీ సమాజ జీవితం పట్ల వ్యగ్రత కల వ్యక్తిగా చావలి రామచంద్రరావుగారు కమ్యూనిస్టుగా తన జీవితాన్ని సర్వతోముఖ సేవలో దీక్షా దక్షతలతో గడిపి ఎనభయ్యో పడిలోకి చేరుకుంటున్న ధన్యజీవి, ఇట్టి వార్థక్యంలో వారు అందిస్తున్న ఈ కావ్యాన్ని ప్రచురించి ప్రజలముందు పెట్టే సదవకాశం సోదరకవిగా నాకు లభించినందుకు ధన్యవాదాలందజేస్తున్నాను. మిత్రులు శ్రీ చా.రా. శేషజీవితాన్ని ప్రశాంతంగా, సుఖప్రదంగా సాగించాలని కోరుతూ శుభాకాంక్ష లందిస్తున్నాను.

కళాకేళీ నికేతన్, పిఠాపురం

**డా॥ ఆవంత్స సోమసుందర్**

1-11-2003

# సమరమా? శాంతియా?

మానవ సమాజాన్ని పిచ్చెక్కిస్తున్న యుద్ధం అనే సమస్యను దృష్టిలో పెట్టుకొని, 'కళింగవిజయ' (అశోకుడు కళింగదేశాన్ని జయించి, బౌద్ధ ధర్మాన్ని స్వీకరించడం) రచించిన తరువాత ద్వితీయ ప్రపంచయుద్ధం ముగుస్తున్న సమయంలో శ్రీ రామధారీ సింహ 'దినకర్' తన సుప్రసిద్ధ 'కురుక్షేత్ర' కావ్యాన్ని రచించాడు. యుద్ధం అనేది మానవజాతిని అతి పురాతనకాలం నుండి అతలాకుతలం చేస్తున్నది. తాత్త్వికత ప్రధానంగా మనదేశంలో దీనికి రెండు సమాధానాలు. 1) నివృత్తి మూలకమయినది, 2) ప్రవృత్తిమూలకమయినది. నివృత్తిమూలకమైన సమాధానం సూచించేవారు ఏవిధంగానూ, ఎట్టి పరిస్థితుల్లోనూ యుద్ధం కూడదంటారు. ఈ కోవకు చెందిన వారిలో గౌతమబుద్ధుడు, ఏసుక్రీస్తు, ఆధునికయుగంలో మహాత్మాగాంధీ ప్రధానులు. రెండోరకం సమాధానం చెప్పేవారిలో న్యాయాన్ని, సమసమాజాన్ని స్థాపించడానికి ధర్మయుద్ధం తప్పనిసరి అనేవారిలో మార్క్స్, లెనిన్ ప్రధానులు. ఈ పరస్పర విరుద్ధాలయిన సిద్ధాంతాల అంతర్ద్వంద్వమే 'కురుక్షేత్ర' కావ్యంలో ధర్మరాజు, భీష్మపితామహుల ద్వారా చిత్రీకరించబడింది.

యుద్ధం, అహింసలను విపులంగా చర్చించి, అడవులలో తలదాచుకోవడం కాదు వీరుని లక్షణం, దేశసేవ, మానవజాతి సేవ, సమసమాజనిర్మాణమే వీరుని లక్షణమని ఉద్బోధిస్తాడు దినకర్.

యుద్ధం-శాంతి, హింస-అహింసలను విశదంగా విశ్లేషించిన 'కురుక్షేత్ర' కావ్యాన్ని విమర్శకులు నవయుగపు భగవద్గీతగా పేర్కొన్నారు.

మకుటాయమానమైన ఈ 'కురుక్షేత్ర' కావ్యాన్ని రచించిన శ్రీ రామధారీ సింహ - బీహారు రాష్ట్రంలో ముంగేర్ జిల్లాలోని 'సిమిరియా' అనే కుగ్రామంలో 1908లో జన్మించాడు. ప్రాథమిక విద్యాభ్యాసం సిమిరియాలో జరిగింది. తరువాత ఉన్నత విద్యకై పాట్నా చేరుకున్నాడు. అక్కడ బి.ఎ. పాసయిన తరువాత కొద్దికాలం సబ్ రిజిస్ట్రార్‌గా ఉద్యోగం చేసినా, మళ్ళీ కాలేజీలో చేరి చరిత్ర ప్రధాన విషయంగా ఎం.ఎ. పట్టా పుచ్చుకున్నారు. కొంతకాలం హెడ్‌మాస్టరుగా, సమాచార సంబంధాల శాఖకు డిప్యూటి డైరెక్టరుగా, ప్రొఫెసరుగా, వైస్ ఛాన్సలరుగా, కేంద్రప్రభుత్వ హిందీ సలహాదారుగా, 12 సంవత్సరాలు రాజ్యసభ మెంబరుగా ఉండి అనేకమయిన బహుమతులు, సన్మానాలు (పద్మభూషణ్), జ్ఞానపీఠ పురస్కారం పొందాడు. జాతీయకవిగా ప్రఖ్యాతి గాంచాడు. పౌరుష ప్రధానమయిన అనేక కవితలు, కావ్యాలు రచించిన దినకర్ చివరి రోజుల్లో కుటుంబసమస్యల మూలంగా మానసిక వెతలకు గురి అయి,

తిరుమలేశుని దర్శించుకొని, మద్రాసునగరం చేరి గుండెపోటువల్ల 1974లో దివంగతుడయ్యాడు. దినకర్ గారి చివరి కావ్య సంకలనం పేరు 'హారేకో హరినామ్' (ఓడిపోయిన వానికి హరి నామస్మరణమే గతి)!

'ఛాయావాద' భావపరంపరతో కావ్య రచన ప్రారంభం చేసినా, దేశభక్తికి, ప్రాచీన భారతీయ సంస్కృతీ వైభవం పట్ల మొగ్గుచూపి, జాతీయకవిగా పేరొందాడు. ఆకాశవీధుల్లో విహరించే ఛాయావాద కవిత్వాన్ని, మిట్టీకీ ఓర్ (మట్టివైపు) తీసుకురావడానికి సఫల ప్రయత్నం చేసి, తన ఉపనామం 'దినకర్'ని సార్థకం చేసుకున్నాడు.

'పాటలీ పుత్రకీ గంగాసే', 'హిమాలయ్‌కే ప్రతి', 'పరశురామ్ కీ ప్రతీక్ష' మొదలగు కవితలలో భారతదేశపు అతీత గౌరవాన్ని ఉగ్గడిస్తూ, మాకు ప్రస్తుత పరిస్థితుల్లో ఓ ధర్మరాజు, ఓ నకులసహదేవుల అవసరం లేదు, మాకు కావలసిందల్లా భీముడూ, అర్జునుడూ అని, ఇదం బ్రహ్మం, ఇదం క్షాత్రం అనే పరుశురాముడికోసం ఎదురు చూస్తున్నామని ఘంటాపథంగా చెప్పాడు. సామ్యవాద భావాలను అభివ్యక్తీకరించినా, ఆయనను 'అభ్యుదయ' కవి అనడానికి వీలులేదు. ఆయన కవితల్లో సామాజిక చైతన్యం కొట్టవచ్చినట్లు కనిపించినా, దినకర్ కమ్యూనిస్టు మాత్రం కాదు.

'రేణుకా' (1935), 'హుంకార్' (1940), 'రసవంతీ' (1940) ఆయన ప్రారంభిక రచనలు. వీటిలో ఆయన ఆత్మమథన ప్రక్రియ కనిపిస్తుంది. కాల్పనికత, సామాజిక చైతన్యం మధ్య తనదైన మార్గాన్ని వెతుక్కునే ప్రయత్నం కనిపిస్తుంది. అతీతం పట్ల గౌరవాభిమానాలతో పాటు, వర్తమాన దీన పరిస్థితుల పట్ల వ్యధిత కవిహృదయావేదన గోచరిస్తుంది. 'సామధేనీ' (1947) లో దినకర్ సామాజిక చైతన్యం స్వదేశం దాకానే పరిమితం కాకుండా, విశ్వవేదనను దర్శించింది. ఆ తరువాత 'నీల్ కుసుమ్' (1955)లో కవి కావ్యాత్మకమైన అభ్యుదయతత్త్వాలకు అందలం పట్టి, తోటి అభ్యుదయవాద కవులకు నీరాజనం పట్టాడు.

ఈ ముక్తక కావ్యసంకలనాలే కాకుండా ఎన్నో ప్రబంధకావ్యాలు, ఖండ కావ్యాలు కూడా రచించాడు. వాటిలో చెప్పుకోదగ్గవి 'కురుక్షేత్ర' (1946), 'రశ్మిరథి' (1952), 'ఊర్వశీ' (1961). 'రశ్మిరథి'లో కర్ణుడి జీవితకథ ఆధారంగా సమాజంలోని దళితులనబడేవారి దీనగాథలను హృదయ విదారకంగా వర్ణించాడు.

'ఊర్వశీ'లో సమాజంలో స్త్రీ పురుషుల స్థానం, వారికి గల అధికారాలు మున్నగు ఎన్నో విషయాలను కూలంకషంగా చర్చించి, ఈ చర్చకు స్వయంగా తానే 'కామాధ్యాత్మ'మని పేరు పెట్టాడు. ఈ కావ్యానికి దేశంలో అత్యున్నతమయిన జ్ఞానపీఠ బహుమతి లభించింది.

కావ్యరచనలే కాకుండా గద్యరచనలో కూడా మేటి అనిపించుకున్నాడు. 'సంస్కృతి కే చార్ అధ్యాయ్' లో భారతదేశపు చారిత్రిక సాంస్కృతిక వికాసాన్ని బృహద్గ్రంథంగా నాలుగు అధ్యాయాల్లో (1. భారతీయ జనతాకీ రచనా - హిందూ సంస్కృతి కా ఆవిర్భావ్. 2.

ప్రాచీన హిందూత్వకే ప్రతి విద్రోహ. 3. హిందూ సంస్కృతి - ఇస్లాం. 4. భారతీయ సంస్కృతి - ఐరోపా) పరిశోధనాత్మకంగా విశ్లేషించాడు. ఇది చరిత్ర, సంస్కృతి, రాజనీతి అనే ముప్పేటగా సాగిన మహత్తరమైన పరిశోధనా గ్రంథం.

ఇది కాక 'మిట్టీకీ ఓర్', 'సచ్చీ కవితాకీ ఖోజ్‌మే', అనేవి దినకర్ అప్పుడప్పుడు వ్రాసిన సాహిత్య వ్యాసాల సంకలనాలు. తన రచనల ద్వారా ఆత్మపరీక్షణ చేసుకో గలగడమే దినకర్ వైశిష్ట్యం. ఈ దృష్ట్యా పై రెండూ కవులకు ఆదర్శప్రాయంగా నిలుస్తాయి.

ఆధునిక హిందీ కావ్యజగత్తులో వీరరస ప్రధానమైన కవితలు రచించిన అసమాన కవివరేణ్యుడు దినకర్. కుత్సిత రాజకీయాలకు దూరంగా ఉంటూ (12 సంవత్సరాలు రాజ్యసభ సభ్యత్వం), ఏ వాదానికి కట్టుబడకుండా, సర్వమానవ స్వతంత్ర అభ్యుదయాన్ని ఆకాక్షించాడు. కల్పనాలోకంలో విహరించడంపై, స్వప్నలోక సుఖాలపట్ల మక్కువలేని సమసమాజ స్థాపనే దినకర్ లక్ష్యం. 'కురుక్షేత్ర' కావ్యంలో సప్తమసర్గ అంతా దీనికి ఉదాహరణగా పేర్కొనవచ్చు. సప్తమసర్గలో ఉపసంహారస్వరూపంగా తన ఉద్దేశ్యాన్ని ఇలా విశదీకరించాడు దినకర్.

ఆశాకే ప్రదీప్‌కో జలాయేచలో ధర్మరాజ్,
ఏక్‌దిన్ హోగీ ముక్త భూమి రణభీతి సే,
భావనా మనుష్యకీ నరాగ్‌మేఁ రహేగీ లిప్త,
సేవిత్ రహేగా నహీఁ జీవన్ అనీతి సే;
హార్‌సే మనుష్యకీ న మహిమా ఘటేగీ ఔర్,
తేజ్ న బఢేగా కిసీ మానవ్ కా జీత్ సే;
స్నేహ-బలిదాన్ హోఁగే మాప్ నరతా కే ఏక్,
ధరతీ మనుష్యకీ బనేగీ స్వర్గ ప్రీతి సే!

సామ్యవాదం వైపు మొగ్గుచూపినా, అది భారతీయ తత్త్వంతో కూడిన సమసమాజ నిర్మాణానికి పునాది కావాలని దినకర్ ఆకాంక్షించాడు. విచారప్రధానమయిన 'కురుక్షేత్ర'లో ధర్మాన్ని, న్యాయాన్ని రక్షించే యుద్ధం వాంఛనీయమేనని నొక్కి వక్కాణించాడు.

దినకర్ రచించిన కావ్యాలలో 'కురుక్షేత్ర' కు విశిష్ట స్థానం ఉన్నది. హిందీ కావ్య పాఠకులను ఉర్రూతలూగించిన ఆ కావ్యాన్ని తెలుగులోకి అనువదించిన శ్రీ చావలి రామచంద్రరావు గారు అభినందనీయులు. ప్రశంసనీయమైన ఈ అనువాద కావ్యాన్ని తెలుగు పాఠకులు స్వాగతిస్తారని ఆశిస్తున్నాను.

**భీమ్‌సేన్ నిర్మల్**

# నివేదన

కురుక్షేత్ర కావ్య రచన వ్యాసభగవానుని మహాభారతాన్ని అనుసరించి జరుగలేదు. మహాభారతాన్ని తిరిగి వల్లించటం కూడా నా అభిమతం కాదు. నేను చెప్పదలచిందేమిటో భీష్మ యుధిష్ఠరుల ప్రసక్తి లేకుండానే చెప్పవచ్చు. కాని అప్పుడీ రచన ప్రబంధ కావ్యం కాకుండా ఖండకావ్యంగా రూపొంది ఉండేది. ఐనా దీనిని ప్రబంధ రూపంలో తీసుకురావడానికి నాకొక నిశ్చితమైన ప్రణాళికేమీ లేదు. అసలు విషయమిది: మొట్టమొదట అశోక చక్రవర్తి నిర్వేదం నన్నాకర్షించింది. 'కళింగ విజయం' అను కవిత రచించేకాలంలో యుద్ధ సమస్యయే మానవుని సమస్యలన్నిటికీ మూలమా అనిపించింది నాకు. ఈ సందర్భంలోనే ద్వాపరం వైపు తిరిగి 'విజయం' అనే చిన్న మాటను కురుక్షేత్రం మైదానంలో పరుచుకుపోయిన శవాల కుప్పలతో సరిపోల్చి చూచుకుంటున్న యుధిష్ఠరుని వైపు దృష్టి సారించాను. అక్కడ నాకు భీష్ముని ధర్మ ప్రబోధంలో ప్రశ్నయొక్క రెండవ పక్షం కూడా దృష్టి గోచరమైంది. ఆత్మ సంఘర్షణను ఆత్మతోనూ, శరీర సంఘర్షణను శరీరంతోనూ మాత్రమే జయించగలుగుతాం. ఇదే ఆ రెండవ పక్షం. ఈ కథ యుద్ధానంతరం జరిగింది. యుద్ధారంభంలో భగవంతుడు స్వయంగా అర్జునుని కుపదేశించిన బోధల సారంశం కూడా అన్యాయానికి విరుద్ధంగా తపోబల ప్రదర్శనను నిరోధించటమే.

యుద్ధం నింద్యం. ఘోరమైన క్రూరకృత్యం. కాని ఇందుకు బాధ్యులెవరు? అవినీతి వలలు పన్ని ప్రతీకారాన్ని ఆహ్వానించేవాడా? లేక ఆ వలలను తుత్తునియలు చేయాలని తహతహ లాడేవాడా? పాండవులను నిర్వాసితులను చేసి దుర్యోధనుడు కూడా ఒక విధమైన శాంతిని నెలకొల్పాడు. ఐతే యుధిష్ఠరుడు ఆ శాంతిని భంగపరచకపోవటమే వాంఛనీయమా?

ఈ స్థూల విషయాలను గురించి జరిగిన ఆలోచనాపరంపరల తోనే ఈ కావ్యం పూర్తి అయ్యింది. భీష్మ, యుధిష్ఠరులను ఆలంబనగా స్వీకరించి ఉన్మత్తుల చేయసాగిన ఈ యుద్ధ సమస్యలను నేనర్థం చేసుకున్న రీతిగా చిత్రించాను. అందువల్లనే నేను కురుక్షేత్రంలోని భీష్మ, యుధిష్ఠరులు కేవలం మహాభారతంలోని భీష్మ, యుధిష్ఠరుల ప్రతిబింబాలేనని వక్కాణించటంలేదు. ఐనప్పటికీ భీష్మ యుధిష్ఠరుల ముఖతా ద్వాపరయుగానికి అన్ని విధాలా అసహజ మనిపించే పలుకు లేవీ వెలువడకుండా ఆమూలాగ్రం జాగ్రత్త వహించాను. కాని భీష్ముడు మన యుగానికి కూడా అన్వయించే విధంగా భాషించే సందర్భంలో మాత్రం కొంత స్వతంత్రం తీసుకొని విశదంగా వర్ణించిన మాట నిజం. అక్కడక్కడ అదే ప్రశ్నకు సంబంధించగల తదితర ప్రశ్నలకు భీష్మ పితామహుని జవాబు ఎలా ఉండగలదన్న 'అంచనా'ను కూడా వినియోగించుకున్నాను. నిజం చెప్పాలంటే 'భారతంలో లేనిది భరతఖండం లోనే లేద'న్న

సామెత చాలావరకు ఈ నాటికీ అన్వయిస్తుంది. మహాభారతంలో రాచరికం లేని సమాజ వ్యవస్థ - దాన్ని విచ్ఛిన్నం చేసిన నీతియొక్క వివరణను అధ్యయనం చేసినప్పటినుండీ నా విశ్వాసం మరింత బలవత్తరమైంది.

ద్వాపరానికి అతకని సందర్భాలెక్కడైనా ఉంటే ఆ బాధ్యతంతా నాది మాత్రమే. అలాంటి సందర్భాలను పాఠకులు - వాటి ప్రక్షిప్తత కారణంగా - తమంతట తామే గుర్తించగలరు. ఆరవ సర్గ మొత్తం అలా అదనంగా చేర్చబడిన భాగమే. ఈ కావ్యానికి సంబంధం లేకుండా ప్రత్యేకంగా కూడా దానికి అస్తిత్వముంది.

చివరకు నే చేసే విజ్ఞప్తి మరొక్కటి. కురుక్షేత్రంలో ప్రబంధానికి ఉండవలసిన క్రమత్వం అందులో వర్ణించబడిన భావాలలో నిబిడమై ఉంది. నిజానికి ఈ పుస్తకంలో నేను బహుశా ఆలోచిస్తూనే ఉండిపోయానేమో. భీష్మునివద్దకు చేరేసరికి కవిత్వం మరుపుకు వచ్చిందేమో కూడా, ఏమైనా కురుక్షేత్రం దర్శన శాస్త్రమూ కాదు; ఎవరో జ్ఞానమూర్తి ప్రౌఢమేధస్సునుండి వెలువడిన మహాద్భుతమూ కాదు. మస్తిష్కపు లోతులకు చేరి మాట్లాడుతున్న ఒక సామాన్య మానవుని శంకాకుల హృదయమిది. అంతే!

ఇట్లు,

**రామధారీసింహ్ 'దినకర్'**

# నా మాట

హిందీ సాహిత్య ప్రపంచంలో అశేష కీర్తి నార్జించిన ప్రియప్రవాస్, సాకేత్, కామాయినీల తరువాత ప్రముఖస్థాన మలంకరించినదీ మహాకావ్యం. ఇట్టి ఉత్తమ కావ్యమును సమర్థులైన సాహిత్యవేత్తలు అనువదించవలసియుండగా నావంటి సామాన్యుడు అనువదించ బూనుకొనటం దుస్సాహసమేనని నేనూ అంగీకరిస్తాను. కాని 'గుండెను గొంతుకలో కొట్లాడించి' అనువదించే వరకూ విశ్రాంతి నివ్వకుండా వెంటాడగల ఉత్తమ కావ్యమును సృజించిన శ్రీ రామధారీ సింహ్ 'దినకర్' గారే ఈ సాహసానికి బాధ్యులు.

శాంతికోసం పరితపించిపోతున్న మానవాళికి ఈ కావ్యం విశ్వశాంతికి సూచించ బడుతున్న విభిన్న మార్గాలలో ఒకదానిని ప్రతిపాదిస్తున్నది. ఇందులో ప్రతిపాదించబడిన మార్గానికి పునాదియైన శాస్త్రీయ ప్రాతిపదికను గురించి గానీ, అవగాహనను గురించి గానీ, ఆచరణ యోగ్యతను గురించిగానీ సంపూర్ణంగా ఏకీభవించలేకపోవచ్చును. కాని ఈ కావ్యంలో విశ్వశాంతికై కవి హృదయం ప్రదర్శించిన తహతహకు మాత్రం జోహారనక తప్పదు. విశ్వశాంతికి ఆత్మసాక్షిగా ప్రతిపాదించబడు ప్రతిమార్గం స్వాగతయోగ్యమే. నన్ను ఈ అనువాదానికి పురికొల్పిం దీ దృక్పథమే.

దృక్పథమూ, పథమూ ఏదైనా సరే నేడు ప్రపంచానికి కావలసింది సుస్థిర శాంతి; సగౌరవ సహజీవనం. మానవజాతి తరతరాలుగా సాధించిన సర్వస్వాన్ని సర్వనాశనం చేయటానికి కంకణం కట్టుకుని పనిచేస్తున్న యుద్ధోన్మాదులకు వ్యతిరేకంగా, యుద్ధానికీ, మారణహోమానికి వ్యతిరేకంగా, భస్మాసురుల హస్తాల్లో చిక్కి అజ్ఞానంగా తయారైన విజ్ఞానాన్ని సుజ్ఞానంగా మార్చటానికీ, సుస్థిర విశ్వశాంతి స్థాపనకూ ప్రతి సాహిత్యకుడు తన కాలాన్నీ, ప్రతి వ్యక్తీ తన బలాన్నీ పణంబెట్టి నిర్విరామంగా పోరాడవలసిన పరీక్షా సమయమిది. ఏది ఏమైనా విశ్వశాంతి స్థాపించి తీరాలి. ఆ పోరాటానికి ఒక చిన్న కానుకే నా యీ కావ్యానువాదం. ఆధునిక హిందీసాహిత్యంలో అగ్రస్థాన మలంకరించిన ఈ మహా కావ్యాన్ని తెలుగు ప్రజల కందించాలనే ఆకాంక్షతోనే హిందీ-తెలుగు సాహిత్యాల ఆదాన ప్రదాన కార్యక్రమంలో నా వంతు కర్తవ్యాన్ని నెరవేర్చాలన్న ఆశయంతోనే ఈ సాహసానికి పూనుకున్నాను.

ఇక నా అనువాదాన్ని గురించి. ఇంతవరకూ తెలుగులో 'Blank verse' విధానంలో ఖండకావ్య రచనలే కాని మహాకావ్య నిర్మాణం జరుగలేదు. అదీగాక 'బ్లాంకు వర్సు' విధానంలో ఖండ రచనలైతే రక్తి కట్టవచ్చును కాని మహాకావ్య నిర్మాణానికి ఆ పద్ధతి రాణించదని – ఒక

అపోహే కావచ్చు - బాగా ప్రచారంలో ఉంది. ఛందోబద్ధ కవితా విధానంపై వుండవలసిన దానికంటే ఎక్కువ అభిమానం లేకుండా పరిశీలించినట్లయితే 'బ్లాంకు వర్సు' విధానంలో సైతం మహాకావ్య నిర్మాణం సమర్థంగా సాగించవచ్చునని విదితమౌతుంది. అనువాద రూపంలో నైనప్పటికీ ఈ సత్యం నిరూపించుదామన్న ఆశయంతోనే ఈ ప్రయత్నానికి పూనుకున్నాను. నేను పండితుడను కాను. ఒక సామాన్య సాహిత్య సేవాభిలాషిని మాత్రమే. సమర్థులైన రచయితలు 'బ్లాంకు వర్సు' లో కావ్య నిర్మాణానికి పూనుకుంటే హృదయాలను కదిలించగలిగిన నవరసభరితాలైన మహా కావ్యాలు ఎన్నయినా అవతరించగలవు. సామర్థ్యం కంటే ఉత్సాహం, నిరాశకంటే ఆశ ఎక్కువ కలవాణ్ణి కావటం చేతనూ, సమర్థులైన రచయితలు 'బ్లాంకు వర్సు'లో మహాకావ్య రచనకు పూనుకుంటారన్న విశ్వాసంతోనూ; పూనుకోవాలన్న ఆకాంక్షతోనూ ఇలా సాహసించటం జరిగిందని సవినయంగా మనవి చేస్తున్నాను.

నిజానికి ఈ కావ్యాన్ని అనువదించటం జరిగి నాలుగు సంవత్సరాలు దాటింది. అప్పటినుండి దీనిని వెలుగులోనికి తేవలెనని ఎంతగానో ప్రయత్నించాను. కాని ఏం లాభం? నేను దరిద్రనారాయణుని ఆప్తమిత్రుణ్ణి కావటంచేత నా కావ్య ప్రచురణ ప్రయత్నం విఫలమైంది. చివరకు 1955 మధ్య కాలంలో ఆంధ్రప్రదేశంలో ప్రముఖ ప్రచురణాసంస్థ అయిన విశాలాంధ్ర ప్రచురణాలయం వారికి నా అనువాదమును చూపించగా వారు దానిని స్వీకరించి ప్రచురించుట కంగీకరించారు. ఈ విధముగా ఎట్టకేలకు నా కోరిక నెరవేరి ఈనాటి కీ కావ్యం వెలుగుముఖం చూడగలుగుతోంది. అందుకు విశాలాంధ్ర ప్రచురణాలయం వారికి ఎంతైనా కృతజ్ఞుడ్ని. నేను కోరినదే తడవుగా అనువాదమును ప్రచురించుకొనుటకు అనుమతి నొసగి పూర్తిగా అపరిచితుడనైన నా యెడల చూపిన ఆదరమునకు, హిందీ మహాకవి శ్రీరామధారీసింహ్ 'దినకర్' గారికి నా హృదయపూర్వక ధన్యవాదములు. ఈ మధ్యనే నా అదృష్టంకొద్దీ "సరస్వతీపుత్ర" శ్రీ పుట్టపర్తి నారాయణాచార్యులుగారి పరిచయభాగ్యం లభించింది. ఇంతలో విశాలాంధ్ర ప్రచురణాలయంవారు ముద్రణ ప్రారంభించితిమని తెలియపరచగానే నేనే శ్రీ 'పుట్టపర్తి' గారిని కలుసుకొని కావ్యానువాదమును వినిపించి పరిచయ వాక్యములు వ్రాయ ప్రార్థించగా వారు దయతో నా కోరికను మన్నించి నా యెడల చూపిన వాత్సల్యమునకు వారికి నా హృదయపూర్వక అభివందనములు. అలాగే నా కావ్యానువాదమును శ్రద్ధగా పరిశీలించి తమ అమూల్య అభిప్రాయముల నిచ్చి ఆదరించిన పెద్దలందరకూ నా కృతజ్ఞతాభివందనములు. కాని ప్రకటింపబడిన అభిప్రాయములలో గ్రంథ విస్తరణభీతిచే కావ్యానువాదమును గురించి వెలువరిచిన భావములను మాత్రము సంపూర్ణముగా ప్రచురించి మూలకావ్య ప్రశంసకు సంబంధించిన విషయాలు మాత్రం అనివార్యంగా మినహాయించవలసి వచ్చినందులకు పెద్దలందరినీ నన్ను క్షమించవలసినదిగా ప్రార్థిస్తున్నాను. ఛందోబంధాలను

తెగద్రెంచి, వ్యాకరణపు గోడలను బ్రద్దలుచేసి నావంటి సామాన్యుడు రచనావ్యాసంగానికి పూనుకొన గల సాహసాన్ని ప్రసాదించిన విప్లవ మహాకవి శ్రీశ్రీకి నా హృదయపూర్వక నమోవాకములు.

అయితే పాఠకులకు నాదొక మనవి. నేను లోగడనే విన్నవించుకున్నట్లు పండితుడను కాను. అదిగాక నేను కావ్యాన్ని అనువదించ బూనుకొనటంలో గ్రాంధికభాషా నియమాలకు గానీ, వ్యాకరణ సూత్రాలకు గానీ కట్టుబడదలచలేదు. మూలంలోని భావం చెడకుండా, చేవ తగ్గకుండా, సాధ్యమైనంత ఎక్కువగా ప్రభావోత్పాదకమైన శిష్ట వ్యావహారిక భాషవైపే మొగ్గుచూపాను. అక్కడక్కడ కొన్ని గ్రామ్యపద ప్రయోగములు చేయుటకు గూడా వెనుకాడలేదు. అంతేకాదు; ఒక్క ఆంగ్లభాషా శబ్దములను మినహాయించి – తెలుగు భాషలో కలిసిపోయి. తెలుగుభాషా శబ్దములే ననిపించగల హిందీ, ఉర్దూ శబ్దములను తెలుగు శబ్దములుగా భావించి ప్రయోగించుటకు సిగ్గుపడలేదు కూడా. మిశ్రమ సమాస సాంప్రదాయము తెలుగు సాహిత్యంలో తరుచుగా అమలులో లేనప్పటికీ చెవికి ఇంపుగా తోచిన ప్రతి సందర్భములోనూ మిశ్రమ సమాసములను ఉపయోగించాను. ఈ విధంగా అవసరమనిపించోట్ల కొన్ని ప్రాచీన కట్టుబాట్లను బుద్ధిపూర్వకంగా ఉల్లంఘించాను. దీనిని కొందరు పెద్దలు సమర్థించారు. కొందరు కూడదన్నారు. ప్రకటించబడిన అభిప్రాయముల ద్వారా ఆ విషయం విదితం కాగలదు.

అదీగాక ఇది నా ప్రథమ మహాకావ్యానువాదమని కూడా మనవి చేస్తున్నాను. అందువలన కావ్యంలో భాషాసంబంధమైన, వ్యాకరణ సంబంధమైన దోషములు కొన్ని దొర్లియుండవచ్చును. అచ్చటచ్చట ముద్రణదోషములు గూడా సంభవించి యుండవచ్చును. కనుక పాఠకులు నా యీ ప్రయత్నమును సహృదయతతో పరిశీలించి ఆదరిస్తారని ఆశిస్తున్నాను. ప్రస్తుత ముద్రణలోని లోపాలను పాఠకుల సలహాలతో మలిముద్రణలో సవరించుకుంటానని సవినయంగా మనవి చేస్తున్నాను. నా యీ కృషికి అలాంటి యోగ్యత ఉన్నదీ, లేనిదీ నిర్ణయించ వలసినది మీరే గనుక అది మీకే వదులుతున్నాను. సెలవు.

ఇట్లు
మీ

ఉదయగిరి
1-10-58

**చావలి రామచంద్రరావు**

# పరిచయం

ధర్మానికీ, అధర్మానికీ మధ్య జరుగుతున్న ఘర్షణ నిన్నటిదీ, నేటిదీ కాదు. ఆ రెంటికీ వైరం నైసర్గికం. దాన్ని రూపుమాపటమంటే సృష్టిని తలక్రిందు చేయటమే. వాస్తవానికా రెండూ సరివుద్దీలు. ఒకదాన్నొకటి పైకొంటూ నడుస్తుంటాయి. ఒకప్పు డొకటి గెలిచినట్లు కనిపించినా మరొకప్పు డింకోదాని గెలుపు తథ్యమన్న మాట మనం మరువరాదు. భారత యుద్ధం కూడా ఈ సత్యాన్నే వెల్లడి చేస్తుందనవచ్చు. పాండవుల గెలుపుతో వ్యాసులు విజయాన్ని ధర్మానికే అంటగట్టినా దానికా విజయం శాశ్వతం కాదని చరిత్ర ఘోషిస్తూనే ఉంది. భారత యుద్ధంలో ఓడిపోయిన అధర్మం మరలా ఎన్నోసార్లు విజృంభించింది. తన వికృతాకారం ముందు ధర్మం మోకరిల్లి "సలాము" చేస్తుంటే చూచి అట్టహాసం చేసింది; చేస్తూంది కూడాను. మఱి దీనికెక్కడ తుది.

ఐతే మానవుడీ రెంటిమధ్య సతమతమౌతూ నలిగిపోవలసిందేనా? అన్న ప్రశ్న కూడా మనముందు నిలుస్తుంది. మానవుడు బిక్కమొగం పెట్టి చేతులు ముడుచుకొని కూర్చొనటం పురుషకారాన్ని అవమానించినట్లవుతుంది. వాని చూపులో పురుషకారాన్ని మించింది లేదు. సర్వమూ దానికి దాసోహమ్మన వలసిందేనని వాని ఆశయం. అంటుందని వాని విశ్వాసం కూడాను. ఈ ప్రత్యయం తోనే మానవుడు ముందుకు పోతున్నాడు. ధర్మాధర్మాల గెలుపోటములు పురుషకారం మీదనే ఆధారపడి ఉన్నాయని రుజువు చేస్తున్నాడు. అదేమో గోచరం కాని నియతి సర్వాన్ని నియమిస్తుందంటే "చాలు పో"మ్మంటాడు.

నేడు జగత్తులో బయలుదేరిన క్షోభ చూస్తుంటే గుండె లావులిస్తున్నాయి అను పదమూ–

" ఏ దేశచరిత్రం చూచినా ఏమున్నది గర్వకారణం
నరజాతి చరిత్రం సమస్తం పరపీడనపరాయణత్వం"

అన్న పలుకులు ఋషి వాక్కులలాగ ఎదుట నిలుస్తున్నాయి. ఐతే ఈ వికటాట్టహాసాలకు అంతం లేదా? అన్న ఆర్తనాదం మానవుని అంతరాంతరం నుంచి వినవస్తూంది. "ఉంది" అనే సమాధానం కూడా ఎక్కడో శూన్యం నుండి అభయ హస్తంలాగా నినదిస్తూంది.

ఇంతకూ ఏం జరుగుతుందో!

"ఏం జరుగుతుంది? జరుగవలసిందే జరుగుతుంది."

కాని యీ నిబ్బరం తర్కం ముందు నిలుస్తుందా? మంచుకొండలా కరిగిపోతుంది. పురుషకారం ముందుకు దూసుకొని వచ్చి "అన్నీ నా చేతుల్లో వున్నాయి; నడిపిస్తా" నంటుంది.

నిజమే. నడిపిస్తుంది. సందేహం లేదు. కాని ఏ మార్గంలో నడిపిస్తుంది? ఆ మార్గంలో వెలుగుండాలి. ఆ నడక సుఖాంతం కావాలి. "ఇదో దారి. ఈ దారి వెంట నడుస్తే గమ్యం చేరుకుంటా"వని చూపే మార్గదర్శి కావాలి. అతడు క్రాంతదర్శిగా ఋషిగా తప్పక ఉండితీరాలి. ఇలాంటి వితర్క సమయంలోనే ఈ మహావ్యక్తి కాహ్వానం; ఆయన వాక్కుల కమరత్వం ప్రాపించటమూను. ఆ వాక్కులతో మానవుణ్ణి దేవత్వం వైపుకు నడిపించేవాడే కవి; క్రాంతదర్శి; మహర్షి. అతని వాక్కులే లోకంలో నిత్యమై నిలిచే కావ్యం; నిఖిలమై ఘోషించే వేదం. కురుక్షేత్ర కావ్యం మానవుని ప్రగతికి చాలా దోహదమిస్తుందనే నా నమ్మకం. అలాంటి కావ్యాన్ని అనువదించి శ్రీ చావలి రామచంద్రరావు గారు ఆంధ్రలోకానికి ఉపకారం చేసారు. మూలాన్ని చక్కగా అనుసరించారు. చెప్పదలచిన భావం సూటిగా, వాడిగా చెప్పటం రచయితకు వెన్నతో పెట్టిన గుణంగా కావ్యంవల్ల తెలుస్తుంది. ఏ మాట వెలువడినా అది హృదయాన్ని దూసికొని వచ్చినట్లు తోస్తుంది.

ఈ నరజాతి స్వత్వం
సహజ సురక్షితమై యుంటే
ఈ లోకపు
రూ పీ రూపున నుండెడిదా!

అన్న మాటల్లో ఎంత నిర్వేదమూ, పశ్చాత్తాపమూ ఆయన హృదయాన్ని కలచిందో చెప్పలేం.

మానవుడు కర్మశీలుడు కావాలి. అప్పుడే వాడు భవిష్యత్తును నిర్మించుకో గలుగుతాడు. మనకెందుకని ఉదాసీనంగా తప్పుకోవడం వాని ప్రగతికి నిరోధకం. ఈ భావాన్ని రచయిత హృదయానికి తాకేటట్లు.

"ఇహ మంటే గడగడ మను
మహామహులపై లే దీ మహిభారం
అహరహమూ శ్రమించి
మట్టినుండి మాణిక్యం వెలయించెడి
నరులే యీ భువి కాధారం"

అని సుందరముగా పలుకగలిగినాడు.

"దోసిలొగ్గి అదృష్టానికి
దాసోహ మ్మన దెపుడూ ప్రకృతి
నరుని ప్రయత్న శ్రమలకు
శిరము వంచు నిరంతరం.
విధి లిఖితం విధి లిఖితంబని
నినదింతు రకర్మణ్యులు

చెమటోడ్చి శ్రమించు వీరులు
నొసటి వ్రాత హతమార్తురు."

మొదలైన పద్యాలు సుప్తపన్నగాలను తట్టి లేపుతున్నట్లున్నాయి.

భాషా విషయంలో రచయిత చాలావరకు విశృంఖలంగా ప్రవర్తించాడనే చెప్పవచ్చు. ఐనా కవిశక్తి దాన్ని కప్పుకుంటూ వచ్చింది. నవ్యాంధ్ర సాహిత్యలోకంలో కురుక్షేత మొక "రసఖండం".

సెలవు.

కడప
1-8-58

**(సం) పుట్టపర్తి నారాయణాచార్య.**

---

## శ్రీ వారణాశి రామమూర్తి 'రేణు' యమ్.ఏ గారు

హైదరాబాద్ రేడియో హిందీ ప్రొడ్యూసర్

శ్రీ చావలి రామచంద్రరావు గారు తెనిగించిన 'కురుక్షేత్ర' కావ్యమును ఆద్యంతము విని ఆనందించితిని. హిందీ మాతృకలోని భావసౌందర్యము చెడకుండా అనువాదములోనికి తేగలిగిన వీరి యీ ప్రయత్నము ప్రశంసార్హము. భాష వ్యావహారికము, రచన అంతయు స్వచ్ఛందవృత్తములలో నడిపినారు. సులభశైలి. ధారాశుద్ధి తగినంతగా నున్నది. అనువాదము మూలమునకు దీటుగా ప్రౌఢముగా నడిచినది. అనువాదకులు అభిమానముతో వాడిన 'బజాయించి' 'సతాయించి' లాంటి ప్రయోగములు 'తులసి వనమున గంజాయి మొక్కలుగ' నాకు మాత్రము సమ్మతాలు కాజాలకున్నవి. 'భిన్నరుచిర్హి లోకః' కదామరి! అయినను శ్రీ రావుగారి ప్రయత్నము అభివందనీయము. వీరిట్లే ఇతర గ్రంథరత్నములకు గూడ ననువాదములు సాగింతురుగాక. ఆంధ్ర హిందీ సాహిత్యముల ఆదాన ప్రదాన కార్యక్రమమును చక్కగా పోషింతురుగాక.

శుభం భూయాత్!

గుంటూరు
9-1-54

**(సం) వారణాశి రామమూర్తి**

'కురుక్షేత్రం' ద్వితీయ ముద్రణ సందర్భంలో అనువాదకుని

# మనవి

ఆధునిక హిందీ సాహిత్యక్షేత్రంలో కీ.శే మహాకవి శ్రీరామధారీ సింహ్ 'దినకర్'కు ఒక విశిష్ట స్థానం ఉన్న విషయం జగద్విదితం. ఆయన అత్యంత ప్రతిభావంతమైన పలు కవితా సంకలనాలను, కావ్యాలను రచించారు. అయితే ఆయన రచనల్లో ఎన్నో కొన్ని కవితలు తప్ప ఆయన కావ్యాల్లో ఏదీ తెలుగులోకి అనువాదం కాలేదు. ఆయన రచించిన కావ్యాలన్నిటిలో 'కురుక్షేత్ర'కు అత్యధిక ప్రాధాన్యత లభించిన విషయం గమనార్హం. అందుకు ఆ కావ్యం హిందీ కావ్య ప్రపంచంలోనే ఒక విలక్షణమైనది కావటం ఒక ప్రధాన కారణం. 'కురుక్షేత్ర' అనేక యితర కావ్యాలవలె కథాప్రధానమైనది గాక ఒక తాత్వికప్రాతిపదిక గల తర్క ప్రధానమైన మహాకావ్యం. అంతేకాదు. ఈ తరహా కావ్యం హిందీ సాహిత్యంలోనే కాదు; తెలుగు సాహిత్యంలో కూడా లేదు. ఇందులో అంతర్గతంగా మార్క్సిస్టు, గాంధేయ తాత్వికదృక్పథాల, భావాల సమన్వయ ప్రయత్నంగా గోచరిస్తుంది. మహాభారతంలోని వివిధ ఘట్టాల, ఘటనల ఆధారంగా యుద్ధం, శాంతి, హింస-అహింస, ప్రేమ-కర్తవ్యం వగైరా సంక్లిష్ట అంశాల మీమాంసకు సంబంధించిన తన తర్కాన్ని జొప్పిస్తూ తాను నమ్మిన విశ్వాసాలను, భావాలను శ్రీ 'దినకర్' భీష్మపితామహుని ముఖతా ఆవిష్కరింపజేసారు. సామాజిక పీడనకూ, దోపిడికీ, హింసకూ చోటు లేని ఒక ఆదర్శ మానవ సమాజాన్ని నెలకొల్పటం ద్వారా సుస్థిర విశ్వశాంతి స్థాపనమే శ్రీ 'దినకర్' ఈ కావ్యంలో ప్రతిపాదించిన, ప్రబోధించిన మహోన్నత లక్ష్యం.

'కురుక్షేత్రం' లోని మహోజ్వల భావజాలం నన్నెంతగానో ఆకట్టుకుంది. ఫలితంగా ఆ కావ్యాన్ని తెలుగులోకి తేవాలన్న ఆకాంక్ష నాలో ప్రబలంగా రేకెత్తింది. అయితే హిందీ, తెలుగు ఉభయ భాషల్లోనూ నాకు ఒక విద్యార్థిగా పుస్తక, పత్రికా పఠనం ద్వారా లభించిన ఎంతో కొంత పరిచయమే గాని నేను ఏ భాషలోనూ నిష్ణాతుణ్ని కానని నాకు తెలియక పోలేదు. నేను గతంలో ఒక రాజకీయ కార్యకర్తగా పనిచేస్తున్న కాలంలో రాష్ట్రంలో, దేశంలో సాగుతూ వచ్చిన వివిధ ప్రజాఉద్యమాల స్ఫూర్తితో ఆయా ఉద్యమాల ప్రయోజనాల కోసం ఉడుతాభక్తిగా పలు కవితలు, గేయాలు రచించటం జరిగినా సాహిత్యరంగంలో నా కృషి పరిమితమే నన్నది వాస్తవం.

'ఇండియన్ గోర్కీ'గా ప్రసిద్ధి చెందిన ప్రముఖ అభ్యుదయ హిందీ రచయితగా 'ప్రేమచంద్' రచనలను తెలుగులోకి తెచ్చిన తొలివ్యక్తులలో నేనూ ఒకడినే అయినా, ప్రసిద్ధ హిందీ కవుల రచనలలో ఏవో కొన్నిటిని అనువదించినా ఒక కావ్యాన్ని అనువదించిన అనుభవం నాకు లేదు. అయినా శక్తి కంటే ఆసక్తి, ఉత్సాహం, ఉద్వేగం అధికంగా గల వ్యక్తిని కావటంచేత

యీ 'కురుక్షేత్ర'ను అనువదించటానికి సాహసించాను. ఆ సాహసం ఫలితమే 'కురుక్షేత్రం' ప్రథమ ముద్రణ ఆవిర్భావమని మనవి.

ఈ కావ్యాన్ని అనువదించటంలో నాకు గల లక్ష్యాలు మూడు. ఒకటి శ్రీ 'దినకర్' కావ్యాలలో విశిష్ట స్థానం గల యీ 'కురుక్షేత్ర'ను తెలుగులోకి తేవటం, తద్వారా హిందీ-తెలుగు సాహిత్యాల ఆదాన ప్రదాన కార్యక్రమంలో నేనూ పాలు పంచుకోవటం.

రెండవది 'ఫ్రీ వర్సు' ఖండ రచనలకే కాదు; మహాకావ్యానికి గూడా యోగ్యమే నని నిరూపించటం.

సమరోన్మాదంతో కల్లోలితమవుతున్న నేటి ప్రపంచానికి సుస్థిరశాంతిమయ జీవితమే సర్వసమస్యా పరిష్కారానికి ఏకైక మార్గమని శ్రీ 'దినకర్' యీ కావ్యం ద్వారా యిచ్చిన అమూల్యమైన సందేశాన్ని తెలుగు పాఠకులకు అందించటం మూడవది.

ఎలాగైతేనేమి 'కురుక్షేత్ర' కావ్యానువాదం 1953 లోనే పూర్తి అయ్యింది. స్వంతంగానే ప్రచురించి కావ్యాన్ని వెలుగులోనికి తేవాలని ప్రయత్నించినా అప్పట్లో ఆర్థికంగా నేను అధోజగత్సహోదరుణ్ణి కావటంచేత నా ప్రయత్నం ఫలించలేదు. చివరకు అయిదు సంవత్సరాల తరువాత 1958లో విశాలాంధ్ర ప్రచురణాలయం (విజయవాడ) వారు అందుకు పూనుకున్నందు వల్ల మాత్రమే నా ఆకాంక్ష నెరవేరింది. అందుకు వారికి నా కృతజ్ఞతాభివందనలు. శ్రీ 'దినకర్' కూడా కావ్య ప్రచురణకు అనుమతించి ఆశీర్వదించారు. ప్రథమముద్రణ సందర్భంలో 'సరస్వతీపుత్ర' శ్రీమాన్ పుట్టపర్తి నారాయణాచార్యులవారు నా అనువాదానికి పరిచయ వాక్యాలు రాయటం నా మహద్భాగ్యం. కావ్యానువాదంలో కొంతభాగాన్ని శ్రీ 'దినకర్' శ్రీ గంగా శరణ్ సింహ్‌తో కలిసి ఒంగోలులో జరిగిన హిందీ మహాసభలో స్వయంగా విని ప్రశంసించారు. అలాగే శ్రీయుతులు బౌద్ధవాఙ్మయబ్రహ్మ దుగ్గిరాల బలరామకృష్ణయ్య, మానికొండ సత్యనారాయణ శాస్త్రి, వెంకటాచల శర్మ, వారణాశి రామమూర్తి 'రేణు' గార్ల ప్రశంసలు గూడా లభించాయి. కావ్యం వెలువడిన తరువాత పలువురు పెద్దల, పత్రికల ప్రశంస లందుకోవటం జరిగింది. తొలి ముద్రణగా ప్రచురించిన వెయ్యి కాపీలూ చెల్లిపోయాయి. ఫలితంగా నా ఆత్మవిశ్వాసానికి మరింత బలం చేకూరింది. ఆ వెంటనే మళ్ళా ద్వితీయ ముద్రణ తీసుకురావాలని ప్రయత్నించినా ఆర్థిక అవరోధమే అడ్డుగా నలిచింది.

అయితే మళ్ళా నాలుగున్నర దశాబ్దాల తరువాత యిప్పుడు యీ ద్వితీయ ముద్రణ ద్వారా 'కురుక్షేత్ర' కావ్యాన్ని తెలుగు పాఠకులకు అందించ గలుగుతున్నందుకు మిక్కిలి ఆనందిస్తున్నాను. ఇప్పుడయినా యిది సాధ్యం కాగలిగిందంటే అందుకు ప్రముఖ అభ్యుదయ కవి, విమర్శకులు, అరసం సంస్థాపకులలో ఒకరూ అయిన నా చిరకాల మిత్రులు డా॥ ఆవంత్స సోమసుందర్ గారి ఉత్సాహ ప్రోత్సాహాలే కారణమని మనవి. అందుకు వారికి నా హృదయ పూర్వక కృజత్ఞతలు.

అంతేకాదు, శ్రీ సోమసుందర్ గత సంవత్సరాంతంలో ఒక ప్రమాదానికి లోనైన కారణంగా కొన్ని నెలలుగా తీవ్ర అస్వస్థతతో బాధపడుతూ గూడా నా పట్ల గల ప్రేమాభిమానాలతో యీ రెండవ ముద్రణ భారాన్ని ఆద్యంతం తన భుజస్కంధాలపై వేసుకుని యీ కావ్యాన్ని వెలుగులోకి తేవటం జరిగిందని మనవి.

ఈ రెండవ ముద్రణ సందర్భంలో శ్రీ 'దినకర్' జీవిత, సాహిత్యాల సమీక్షను అనుబంధంగా పొందుపరచటం సుముచితంగా ఉంటుందని భావించి, అందుకు ఉస్మానియా యూనివర్సిటీ మాజీ హిందీ శాఖాధిపతి, ప్రముఖ రచయిత, హిందీ-తెలుగు సాహిత్యాల ఆదాన-ప్రదాన కృషిలో ప్రసిద్ధులు అయిన శ్రీ భీమ్‌సేన్ 'నిర్మల్' గారిని కోరగా వారు దయతో నా కోర్కెను మన్నించి చక్కని సమీక్షను అందించినందుకు వారికి నా హార్థిక ధన్యవాదాలు.

అలాగే యీ 'కురుక్షేత్ర' కావ్యాన్ని సర్వాంగసుందరంగా తీర్చిదిద్ది అందించిన డా॥పూషా, (రాంషా-శిరీష ప్రచురణలు) వారికి నా ప్రత్యేకాభివందనలు.

చివరగా నా యీ కావ్యానువాదం ప్రథమ ముద్రణ కంటే మరింతగా పెద్దల, కవుల, రచయితల సాహితీ ప్రియులైన పాఠకుల ఆదరాభిమానాలను అందుకోగలదని ఆశిస్తున్నాను.

ఇట్లు

**చావలి రామచంద్రరావు**

(సమతారావు)

కనగాల

1-11-2003

# ప్రథమ సర్గ

ఎవ్వరిదా రోదన
నవయువకుల రక్తసిక్త
లేఖిని విరచించిన చరిత్ర ప్రాంగణాన-
తనుగా పోరాడని, తనవి గాని యితరేతర లక్షల తనువుల
హననం చేసే రాజనీతి విశారదుడు:
మేధలో విద్యుత్తు, హృదయంలో మలినం
మూర్తీభవించిన కునీతిమూర్తి -
ఒక వృద్ధుని విశ్వాస సహిత వినిశ్వాసం వెలువరచిన ప్రవచనం-
"నెత్తురు నదులై పారినవా! పోనీ! దేశ గౌరవం నిలిచింది;
దేశమాత గర్విస్తోంది! - నిజం?"

అదుగో చూచారా! దేశమాత ఫాలంపై విలసిల్లే
కుంకుమ అరుణారుణ గౌరవ పరిరక్షకు
తమ పసుపు కుంకుమల పణమొడ్డిన అసంఖ్యాక
సతీమణుల స్మరణం: దేశమాత ప్రతిష్ఠ పతాక
గగనాంగణ మధ్యంలో
విహరించగ - తమ నెత్తురు ముద్దల, ప్రియ పుత్రుల
రణమారణహోమంలో స్వాహా చేసిన
అగణిత సతీమతల్లుల అఖండ సన్మానం
జరుగుతోంది బ్రహ్మాండంగా! అల్లదిగో! కన్నారా!
ప్రతిష్ఠ! దేశమాత ప్రతిష్ఠట! యిది వాస్తవమా? హాలాహల
ద్రోహబుద్ధి కావరణా? ఘనీభూత స్వార్థసభ్యతాధినేతల
ఉదరంలో మండే చిరకాల దురాశాకీలలు
చూపే ఒక సాకా? ఆ అరిష్ట ప్రతిష్ఠారహస్యం
తెలియాలా ఈశునకే!
విశ్వజన ప్రశాంత రాగరహిత హృదంతరాళంలో
కనలే మీ కుటిలాగ్నులు; కొద్దిమంది విషోరగ వ్యక్తుల

విష శ్వాసల్లో రగులుత వీ యుద్ధాగ్నులు
విశ్వ జన సామాన్య మేనాడూ కోరదు యుద్ధం!
ప్రశాంత శాంతికి అనవరతం సంసిద్ధం.

మరిగే ఉద్వేగంతో మానస పటలంలో
జరుగుతుంది సంఘర్షణ ప్రతి యుద్ధానికి ముందూ!
ప్రతి యుద్ధానికి ముందూ, ఉదయిస్తుందొక సవాలు -
"అన్యాయం, అవమానం, విషయ విద్రోహం"
వినాశనమయ్యేందుకు శస్త్రాస్త్రాలేనా సాయం?
లేదా అపాయం లేని మరో ఉపాయం?

ఐతేనేం? యుద్ధానికి సిద్ధమవక తప్పదు మరి!
ఎలాగో జరుగుతుంది యుద్ధాంతం. మరి జరిగిందా
సమరాత్పూర్వ సమస్యాంతం? నిరాశ! ఘోర నిరాశ!
రక్తసిక్త రణరంగంలో చరిత్ర ముంగిట
విజేత పర్యాలోకనలో నగ్నంగా కనిపిస్తోంది
సత్యమూర్తి విపరీత విలాపం. రోదిస్తోంది కంటినీరు కాలువగా.
విజేత వదనంపై వర్షిస్తోంది శోకవృష్టి!
అసత్యపు ఆఘాతాలకు నిస్సహాయ నీరవహృత్తంత్రులు
ప్రతిధ్వనించాయ్.హృదయ విపంచి నేదో
అజ్ఞాత హస్తం మీటిందో ఏమో!
దహిస్తోంది హృదయం లోనే, లోలోనే పాపం,
కుములసాగు నా విజేత కానేం లాభం?
సత్యాఘాతానికి లేదు ప్రతీఘాతం
జవాబు శూన్యం; అయోమయం.

తటాలున హృదయపుటల భేదించుక
సత్యాఘాతం కల్గించిన వ్యధ సైరించుక
వెడలిందొక ఆక్రందన- "హా! భగవాన్!
ఎంత రుధిర స్రవంతి ప్రవహించిం దీ భువిపై!
ఎంత ఘోరం, అత్యాచారం చేశాడీ మహాపాపి!"

అయితేనేం! అత్యాశ్చర్యం! గత గాయం మానకముందే
తిరిగి తయారు సమరానికి! తిరిగి తరుగుతాడు తలలు!

తిరిగి ఉరుకుతాడు రణరంగానికి!
చస్తాడు; చంపుతాడు; తుట్టతుదకు విలపిస్తాడు!
చరిత్ర చర్విత చర్వణ మిది నరుని గుండె కాదుగదా నల్లరాయి!

గతకాలంలో కురుక్షేత్ర రణరంగంలో
నరమారణ యజ్ఞకాండ ముగిసిందపుడే
సాటి నరుని వక్షం కక్షతీర చీల్చి, వెచ్చని పచ్చి నెత్తురు ముచ్చటగా గ్రోలి
ప్రశాంతమైం దపుడే వజ్రకాయ, మహాబలుడు
భీముని నిప్పులుకక్కే ఎద!

ప్రచండ క్రోధంతో పండ్లు బిగించి
వెచ్చని నర రుధిరంలో పదమూడేళ్ళ క్రితం వీడిన జడముడి
ముంచి, ముడిచి వికటంగా పకపకలాడే ద్రౌపది
ఎవ్వరామె! మానవియా? ప్రజ్వలిత ప్రతీకారాగ్నియా?

వజ్రకాయ, వృకోదరుడు దుస్సహ సమరంలో
అసువులు గోల్పోయిన ఉప పాండవ పంచకమూల్యం వలె
ద్రోణ సుతుని గౌరవ మణి హరించి తన ప్రియురాలికి
అనురాగంతో అర్పించుట అల్లదిగో కన్నారా!

ఇంతకు అంతానికి మిగిలిన సారం?
దాయాదుల శ్రాద్ధకర్మకో, కౌరవప్రేత చితుల సమక్షాన
భోరున రోదించుటకో, వృద్ధాంధుడొకడు!
ఎండిన మొండి చెట్లవోలె మిగిలా రీ భువిపై.

అతిభీకర కురుక్షేత్ర ప్రేతభూమిలో,
పాండవ రణ శిబిర ప్రాంగణాన
లేస్తున్నవి ఉన్మాద హర్ష నినాదాలు;
చేస్తున్నవి వాయువుతో సంఘర్షణ.
ఆ నిస్సారపు, నిర్జీవపు సంఘర్షణలో
నీరసపడి, తలవాల్చుక మరల సాగె శిబిరపు దెస.
జీవిత నిర్జీవుల బుద్ధికి చింతిస్తూ
అపహాస్య కంటకాల నెదలో దిగవేయుచు గొణుగ సాగె–
"ఏం చెయ్యం తిరిగిరాక! కనపడటంలా,

నీరవ నిర్జీవ మహామైదానం? నీ హర్ష నినాద శరాల
కరాళ మరణబాధ భోగించగ ఎవరున్నా రచ్చట!"

హర్షంలో నిబిడమైన ఈ వ్యంగ్యం, అపహాస్యం
గుర్తించిం దెందరు? అంతా విజయ సురాపానోన్మత్తులు!
ఆనంద నిషాలో చైతన్యం పతనమైన,
"జీవితులేనా?" అనిపించే అర్ధమృత శరీరు లంతా!

మరి ఈ సత్యం గుర్తించెడి మేధస్సే లేదా – లేకేం?
ఈ ఆనందోన్మత్త జడసముదాయంలో సైతం
ఉన్న దొక ఉన్నత మేధ. కాని ధరించింది మౌనం.
మగ్నమైంది నిశ్శబ్దసముద్రంలో. ఐతేనేం? లోలోపలె కుములుతోంది.

"తిరుగు లేని సత్యం; కఠోర వాస్తవమిది!
అంతా, అంతా గతించారు. పయనించా రతి దూరం.
ఈర్ష్యా, ద్వేషం, హాహాకారం మచ్చుకైన కానరాని
మరోలోకపు వాసుల కేల యీ పాదుగోల!
అందుకనే యీ హర్షం జీవితులు క్రుంగి కృశించే వ్యంగ్యం."

అదేదో స్వప్నంలోవలె అదుగో! లీలగా దుర్యోధను
దేదో అంటున్నాడు! "ధర్మజా! మాకా లోకపు పని తీరెను.
చేరాం మే మీవలి ఒడ్డుకు.
మా గుండెల్లో గాయం చేసేందుకు లేదు నీ కవకాశం.
లేదు మా కేమాటా వినపడే ఆశ. ఎందుకు వృథా ప్రయాస?

"మే మీ లోకం చేరాం. రుధిరధార మహాభారతం
మాకొక స్వప్నం మాత్రం. అంతఃశూన్యంవలె
ఎపుడో ఘటించిన సాధారణ ఘటనవలె–
లీలామాత్రంగా కన్పిస్తున్నది.
వాటర్థం, మూల్యం, సారాంశం స్మృతిపథాన అదృశ్యం!

"మే మీ లోకంలో; మీ రా లోకంలో!
పరాజయం! పోనీ జయమేలే! దక్కిం దెవరికి? గెలించిం దెవ్వరు?
పాపం! నీవేలే! నీవేలే జయఫలాలు!
–వ్యంగ్యం, పశ్చాత్తాపం, అంతర్దాహం–"

జనిస్తోంది హర్ష నినాదం కురుభూమిలో
తిరిగి, తిరిగి, నీరసపడి సొక్కి, సోలి, తూలి,
తుదకు కూలుతోంది. వింటున్నాడు యుధిష్ఠరు డిది అవ్యక్త అవధానంతో.
ఇది అంతర్గతశూన్య మనోరవమా?
బహిర్గత శూన్యోద్భవ కలరవమూ? ఏదో సందియమే!

"ధాత్రీ గర్భంలో కోసెడు దూరం యింకెను
ఎటు చూచిన ఎర్రని నెత్తురు. తెగిన అవయవాలు,
శిథిల రథాలు, కూలిన మదగజాలు,
హననమైన హయాలు ప్రవహిస్తున్నవి రుధిరంలో
అపార పారావారంగా...

"కాని ఘోరవిధ్వంసాంతాన బావుకున్న దేమున్నది?
-అదృష్టంపై అపహాస్యం వినా!-
ఏ సత్యం, ఏ మూలం, ఏ విశ్వరహస్యంకోసం
చేశానో తపస్సు, కన్నానో కలలు
ఐందా దృష్టి గోచరం? కాలేదు గదా కర్పూరం!
"ఏ ధర్మం, ఏ సత్యం, హస్తగతం కావాలని
అర్రులు సాచానో, ఆందోళన పడ్డానో,
కాలే దది హస్తామలకం.
ఆనాడే వీడిం దీలోకం; చేరిం దాలోకం
మృత శత్రు ప్రాణ హయాసనియై.
అవహేళన, పశ్చాత్తాపం అప్పగించె నాకోసం!"
"వ్యర్థం, వ్యర్థం, యుద్ధం! వృథా, వృథా, విధ్వంసం!
ఫలశూన్యం మహాభారతం!
ఐదుగు రసహిష్ణుల ద్వేషం చేసెను భువి హూనం, హూనం!
"ఈ యుద్ధపు పర్యావసానంగా కావచ్చు దివ్య వసన
ధారిణి మా ద్రౌపది. విలాసమయ, అహమ్మయ
స్వర్గ సామ్రాజ్యంలో భోగలాలసమై
విలాసవంతంగా గడుపవచ్చు. ఐతే ఈ భోగపు మూల్య మెంత?
ఎందరి సతీమణుల నొసటికాంతి నశించింది!
ఎందరి తల్లుల కడుపుపంట మంటల పాలయ్యెను!
వేలు కాదు; లక్షలలో! కాదు కాదు; కోట్లల్లో!

అరుగో! పతిహీన, పుత్రహీన పవిత్ర సతీమతల్లులు;
పండిన వాత్సల్య మూర్తులు!

"ఇది రక్తసిక్త బీభత్సపు రాజ్యం ఎలా సహించ నారాజ్య వైభవం?
కాదు నాది పాషాణపు హృది నర రక్తంతో తడిసిందీ రాజ్యం
అసమాన పరాక్రమి, బాలుడు అభిమన్యుని ఎర్రనిరక్తం
మిళితమైన నెత్తురుము ద్దీ మేదిని!
అబ్బా! ఘోరం! దుస్సహ మీ రాజ్యం; దుర్భర మీ భోగం."

ఒక్కసారి ధణేలుమని పిడుగుపడినవిధ మయ్యెను
స్మృతిపథాన. క్రుంగిపోయే ధర్మజు డా భారంతో.
రణరంగ శ్మశానభస్మంలో సత్యాన్వేషణ సలిపే
సూక్ష్మబుద్ధి సైతం, క్రుంగిపోయె సమూలంగ;
వికావికలయ్యెను హృదయం.

వేదనతో, రోదనతో నిండెను హృదయ సముద్రం.
ఐతేనేం నురుగు లేదు. బుద్బుదాలు మొదలు లేవు.
అంతా శూన్యం, నిస్తబ్ధం, నిరామయం.
విక్షుబ్ధ వక్షాంతర్భాగం పూర్ణమయ్యె విస్తరించె. తీరని ఆవేదనతో
అన్నా డొకటే మాట– "పార్థా! నే వెళుతున్నా, భీష్మ పితామహు వద్దకు."

మరొక దెస హర్ష నినాదాలు మనోగగన భావ తరంగాల వలె
లేస్తున్నవి వాయుమండలాన కుంటి కుంటి,
నీరసపడి అంతరిస్తున్నవంతరిక్షాన్నే!

# ద్వితీయ సర్గ

శరనిర్మిత శయ్యపై, శరాలే తలగడగా
శాంతంగా పవ్వళించి – "యిపు డపుడే పోదీ ప్రాణం;
గ్రహించి ప్రతీక్షించు దాపు నొక్క మూల"
అన్నా డజేయ భీష్ముడు, చనుదెంచిన మృత్యువుతో.
ఇది భారత యితిహాసకర్త వ్యాసుని ఉవాచ.
కాలుని జయించి, మృత్యువు భృత్యుడు కాగా,
విముక్తుడై, ప్రశాంతగతి పవళించెను శయ్యపైని.
అటు మృత్యువు అటనే సమీపానె, శిక్షితువలె,
వినమ్రమై, దోసిలొగ్గి ప్రతీక్షిస్తున్నది
భీష్ముని అసువులు గ్రసియించగ.

ఉత్తుంగ జీవన శృంగాగ్రం చేరుక నిర్లిప్తంగా, పరికిస్తూ, పరిశీలిస్తూ,
ప్రశాంత గంభీర యోగనిద్రలో విలీనమై, విరాజిలేకల
భీష్మ పితామహుకడ కేగెను కౌంతేయుడు.
శ్వేత కేశావృత శరగ్రథిత శరీరం విరజిమ్ముతోంది కాంతులు;
నలుమూలల విద్యుత్కాంతులు. స్పృశించాయి ధర్మజు చేతివ్రేళ్లు
భీష్ముని పావన పదయుగ్మాలను. అభిషేకించెను పాదాలను
ద్రవించి ప్రవహించిన ధర్మరాజు కంటినీరు.
ముగ్ధహృదయుడై ప్రణమిల్లెను చరణ కమల సన్నిధిలో.
వ్యాకులుడై భగ్నహృదయుడై క్రందించెను తటాలున–
"తాతా! ఫలశూన్యం మహాభారతం!"

"నాకోసం అశేష, అపార విధ్వంసం ప్రసాదించి
పయనించెను సుయోధను డీ భువిని వీడి దివికి.
తన ప్రేతం చేసి నా హస్తగతం గగనాంగణ మధ్యంలో విహరిస్తూ
పలుమారు తన జయదుందుభి మ్రోగిస్తున్నా డదుగో!
యిక ఈ శేషించిన ప్రేతశరీరం! అబ్బా!

ఉండి ఉండి చేస్తున్నది సవాలు గుండెల్లో-
"ఇదిగో నేనే నీ విజయోపహారం!
ఏం? ఏమంటావ్? ఎవరిది విజయం? ఓడిందెవ్వరు? నీవా? నేనా?

"తాతా! తుద కోడిం దెవ్వరు?
శేషిత విధ్వంసానికి విలపించే దెవరి గొంతు?
కురుక్షేత్ర భస్మంలో ఫల మేమని తాపంతో శోధించెడి దెవరి ఆత్మ?
అగ్నిజ్వాలల మండే రాజకిరీటం వేదనతో తిలకించే దెవ్వరు?
మానవ రక్తప్రవంతి తీర్థస్థలి అదృష్టపు వ్యంగ్యార్థం గుణించువారెవ్వరు?
ఆప్త బంధు, మిత్ర శవాలు మంటల క్షోభంతో వీక్షించే దెవరి కనులు?
ఉత్తర దీనారావం ఆలించే దెవరి చెవులు?

"మహాభారత పరిణామ మిదేనని
నా కిదివరకే మదిలో తోస్తే సిద్ధపడుదునా యుద్ధానికి !
శరీర బలం త్యజించి పోరాడుదు మనోబలంతో.
తపస్సు, సహనం, త్యాగాలతో సాధించేవాణ్ణి జయం శత్రువుపై.
స్థాపించేవాణ్ణి కొత్త పునాదులు ఇతిహాస మహా హర్మ్యానికి.
నా హాహాకారానికి వజ్రం సైతం కరిగి ద్రవిస్తుంది.
నా తపస్సుతో దుర్యోధనుడౌతాడు తప్పక సుయోధనుడు.
ఈ నా విశ్వాసం భ్రాంతిజన్య మంటావా?
ఈ నా ఆశ నిరాశయే నంటావా.
ఐనా సరె సిద్ధమగుదునా యుద్ధానికి!
ఎచ్చటనో, ఏదో ఒక మూలన బిచ్చ మెత్తి గడిపేవాళ్ళం
గడిచెడివార మీ భవాంబుధి ఏదో విధి సోదరసహితంగా.

"ఏ దుర్ముహూర్తాన జరిగిందో నాందీ యుద్ధానికి!
నా దివ్య మేధ సహకారం నెరపలేదు నా హృదితో.
భీమగదా దండం, పార్థుని గాండీవం,
నా కరాన మెరసే కరకు కృపాణం
నా మతి కెక్కించెను యుద్ధోన్మాదం.
అప్పటికీ ఆ రోజున రణరంగ ప్రాంగణాన
బంధుమోహవశియై క్షీణించిన పార్థుని మండే హృదయ
హోమగుండంలో వర్షించెను ఘృత మా పరమాత్ముడు.
ఏమనుకుని ఏం లాభం-తాతా! భ్రష్టమయ్యె బుద్ధు లన్ని

అభిమాన పిశాచం బలిచేసెను సర్వజనుల.

"అంటాడు కృష్ణుడు యుద్ధం పాపం కాదని
కాని నా హృది మండుతోంది; క్షణక్షణమూ క్షోభిస్తోంది.
నరుడీ దహించే అనాది అభిశాపవిముక్తుడు
కాలేకుంటున్నా డెందుకనో ఎరుగరాదు!
నినువంటి అనన్య పరాక్రమి ఒరిగిన కుట్రల, కుహోకాల
మహా మారణహోమం అందేనా అంచనాలకు !
అభిమన్యుని వధ, దుర్యోధనుని హననం తదుపరి
–అబ్బా! పులకరిస్తోంది శరీరం;
యింకా ఏ పాపంతో జీవిస్తున్నా యీ శరీరాలు భువిపై!

"ఒకవైపున మహామహుడు శ్రీ కృష్ణుని గీతావాక్యం;
మరోవైపు జీవిత సారంవలె శ్రేష్ఠమైన వైరాగ్యం!
ఏది దారి?– నిజం! మరోదారి లేకనే చేశా యుద్ధం
ఐనా ఈ రక్తసిక్త విజయం అతి అపవిత్రం
విధ్వంసం నిండిన సుఖమా? శాంతిలోని కన్నీరా?
ఏది నీతి? ఏ దనీతి? ఏదో మరి అయోమయం
అంతెరుగము దీనిలోతు; ఏంతో మరి దీనిలోతు!
ఇంతకీ కురుక్షేత్ర రణరంగంలో పుణ్యమా వికసించింది?
సమస్త ధరిత్రీ పాపం పండి బ్రద్ధలయిందా? ఏది నిజం?

"పరాజిత కురువంశ కిరీటంలో ఏదో ప్రచండ దావకాగ్ని నిబిడమైంది
మనసులోని పాపం, కపటం తనువుకడుగ తరిగేనా?
పాపుల పాలిటి తీర్ధజలం హలాహలం విజయం కరాళ విష భుజంగమై
కాటేస్తున్నది నను తరిమి తరిమి ఈ గండం గడవలేదు బలం నా కడ.
ఈ కల్మష కమలం; ఈ రక్తసిక్త రాజసుఖం!
ఏ విధిగా స్వీకరింతు; ఏరీతిని భోగింతును!
పదేపదే యోచించిన దారిదొరకు దారిలేదు.

"తనయుల కోల్పోయిన తల్లుల ఆక్రందన లొక్కవైపు;
తండ్రులు కోల్పోయిన తనయుల హాహాకారం మరోవైపు;
కన్నుపడిన చోటల్లా కనపడుతుందొకే బొమ్మ–
పసుపు కుంకుమలు తుడిచిన, నొసటి కాంతి తొలగిన,

విషాద విలాపమూర్తి ఈ ఘోరం చూడలేక
చేరుకొనెద భవనాంతర్భాగం. కానేం లాభం! అటుసైతం
ప్రత్యక్షం మృత్యువు వికటాట్టహాసం
నిద్రించిన, మేలుకొన్న అదేమిటో కళ్లముందు
తటాలున మెరుస్తుంది అభిమన్యుని నెత్తురు
కళ్ళు జిగేల్ మనును; ఒళ్ళు ఝల్లుమనును.
యింటా, బయటా అంతట ఎటుచూచిన బీభత్సం!
ఎట విన్నా మరణఘోష!

"యుద్ధాగ్నులు చల్లారిన క్షణంనుండి
ఏదో నా మదిలో మండుతోంది మరో అగ్ని.
తాతా! నరులముఖం, యిక నేనే ముఖంతో చూడ నీజగాన?
జగత్తులో జనులందరు నన్నేహ్యంగా చూస్తున్నారంటున్నది నామది.
ప్రకృతి ప్రతికణమూ నాపై ధిక్కారం చూపుతోంది.
నరుడుకంటబడుటె చాలు కన్నులు తమంతటవే వ్రాలసాగె నేలకు.
తాతా! ఇక నిలువజాల నీస్థలాన; పోవాలనిపిస్తున్నది.
మది నొంటిగ నరసంచార శూన్యమహారణ్యానికి.

"తలచా నాత్మఘాత చేసుకొనగ.
కానది మహాపాతకం; మచ్చకు మరోమచ్చ
కనుకనే పయనించెద పురమువీడి–కాకులైన దూరని కారడవికి.
పశుపక్షుల దృష్టికైన అందని ఒక పర్వత కందరాన
భోరున రోదిస్తా నా వేదన చల్లారగ. తెలుసు పాప
వినాశమార్గం వవవాసం కాదని. ఐనా వనిలో లభిస్తుంది
అజ్ఞాతవాసం. కలుగుతుంది దుఃఖోపశమనం.
ఇచ్చటి వ్యంగ్యశరాల బాధ చేయదు శిథిలం నాగుండెను.
కనీసం 'ధర్మరాజ' బిరుదంతో వేధించదు ననులోకం."

శాంతించెను కొంత తడవు కౌంతేయుడు.
పొంగి, పొర్లి, పారు శోకానికి తుద కెటులో వేసెను కట్టలు.
సంద్రం గర్భాన ధరించియు వర్షించాలను వాంఛెంతగ వేధించిన
వర్షించగ శక్తి లేక లోలోనే కుమిలెడి
మహామేఘసముడయ్యెను కౌంతేయుడు

చూచాడటు భీష్ముడు గగనం దెస,
దర్శించె నిటు వేదనాభరిత యుధిష్ఠర హృదయం
తనలో తనె తలచసాగె ద్రష్టవోలె "అయ్యో! అభాగ్య నరుడా!
ఎప్పటికైనా జయించీ అంధాకారం
అడుగిడగలవా మహాధర్మలోకంలో?
దుఃఖం, వేదన, అఘాతం, వైరాగ్యం. ఒక మానవ హృదిలో ఈ రోజున
కలిగించిన పరివర్తన నీలోనూ కలిగేనా? నీవూ మేల్కొంటావా?"

అన్నాడు తదుపరి ధర్మజుతో- "అబ్బాయ్! తుఫాను చూచే ఉంటావ్
చూడది ప్రళయంవలె గర్జిస్తూ,
వనవృక్షాల నూగిస్తూ, కూలదోస్తూ, కాలునివలె విరుచుకుపడి
చేస్తున్నది సమూలంగ విధ్వంసం, వందల, వేల వృక్షసంతతులను
మహావృక్షశక్తిహీనశాఖలవే ఫెళఫెళమని కూలెను.
శాఖాశ్రిత విహంగ నివాసాలును, కూలిపోయె నేలపైని,
శాఖల వెనువెంటనె. కూలిన వృక్షాలు, తెగినలతలు,
పక్షుల శరీరాలు, విచ్ఛిన్నకుసుమాలు వనదేవి వక్షంపై నిండెను.

ఎచ్చటనో భూగర్భంలో వ్రేళ్ళూనిన మహావటవృక్షం మాత్రం
జంకదీ క్రూర ప్రభంజనానికి, శిలోపరిభాగం స్పర్శిస్తూ,
కొన్నాకులు, రెమ్మలుమాత్రం నష్టపరచి గతిస్తుంది తనదోవన పెనుతుఫాను

శేషించిన వైభవ విధ్వంసం, వనదేవి విషాద వైధవ్యం
తిలకించిన జీవితమహీరుహం విలపిస్తూ, విరాగియై,
దుఃఖతపత్రాలను వాల్చి, నిస్తబ్ధ, నీరవ ఆకాశంలో
యోచిస్తూ, తనలోనే ప్రశ్నిస్తుంది-
'ఎందుకు తల్లీ! ప్రకృతీ! మాపై నీ ప్రభంజన ప్రయోగం?'

పాపమాజడవృక్షాని కేం తెలుసు? -ప్రకృతి సైతం భావదాసియని-
ప్రకృతి కస్త్రం కొదీ ప్రభంజనం ప్రచండ గీష్మంలో ప్రకృతి ప్రాణాల్లో
పేరుకున్న దశేషతాపం, ఆవేగం మరియది బ్రద్ధలగుట సహజం,
అనివార్యం అదే ఆవిస్ఫోటం- పెనుతుపాను!

అదేవిధి మానవలోకంలో సైతం వికారాగ్ని శిఖ లొకదానికొకటి జతయై
ప్రజ్వలించు ప్రచండావేగంతో. మొట్టమొదట తపించేది

ఒక్కనరుని మనోగగనం. క్షోభం, దహించే ఈర్ష్యా,
విషమయ విద్రోహం ఆ మంటకు వంటచెరకు కాగా,
వెనువెంటనే భగ్గుమనును సముదాయపు అంతర్గగనం.

బట్టీ లీ విధి రగిలిన పిదపే ప్రేలుతుంది యుద్ధాగ్ని పర్వతం.
–కుటిల రాజనీతి తెరచాటుననో, దేశభక్తి ముసుగు ధరించో!–

ఐతే అన్నిటికీ మూలం అదే హలా హలం–
'విశ్వవ్యాప్త ఈర్ష్యా, స్వార్థపూర్ణ విద్వేషం'

గుర్తించని నరుడు లేడు యుద్ధం రాబోతోందని.
గమనించని ప్రాణిలేదు యుద్ధాంతం నాశనమని.
నిజం! కోటిమంది వధ ఐదుగురసహిష్ణుల సౌఖ్యానికి

కానీ కురుక్షేత్ర సంగ్రామం కేవల మైదుగురి సుఖానికనటం
అసంగతం, భ్రమాజనితం. యుద్ధక్షతుల సమక్షాన
ఐదుగురి సుఖ దుఃఖాలే కాదు ప్రధానం.

యుద్ధక్షతుల హృదయాల్లో ఉన్నా యింకెన్నో తలపులు.
నిండిన స్వార్థం, పొంగే మానవతా, మండే విద్వేషం
ఈడ్చెను, నడిపించెను రణరంగానికి
ఆ ఆవేశానికి సైతం ఉన్నదొక్క హేతువు.

అంటువ్యాధి యుద్ధోన్మాదం. ఒక్క నిప్పుకణంచాలు రాజటం–
తక్షణం వీస్తాయి తొంబైగాలులు. పరుగెత్తుచు, పకపకలాడుచు
నలుదిశలా అలముకొనును జ్వాలలు.

గంభీర విచారాలకు, తత్వాలోచనలకు యింకెక్కడి దవకాశం?
మానవ ప్రాణాల్లో దాగిన వ్యాఘ్రాలను సవాలు చేస్తున్నాయగ్ని శిఖలు.

యుద్ధఘోష వినగానే ప్రతీకారోత్తేజిత అభిమానం గర్జిస్తుంది తటాలున!
నరాలు తెగ ద్రెంచుక ప్రవహించాలంటుంది రుధిరం!
తక్షణం తనంతటదే కరకుకత్తి కరాన మెరుస్తుంది!

ఎవడూ కోరడు వ్యాధిగ్రస్తుడవాలని.
ఐనా రోగం ముసిరినప్పుడు తిక్తౌషధ ప్రయోగం వినా

ఏమున్నది అన్యోపాయం? షడ్రసాహారంతో శమిస్తుందారోగం?

యుద్ధం పాతకమా? పవిత్రమా? ఈ ప్రశ్నే ఒక ఎండమావు; భ్రమ.
ఈ లోకంలో జరిగే ఏ కార్యం, దానంతటదికాదు పాపం లేక పుణ్యం.

శ్రీకృష్ణుడన్నది నిజమారోజున.
ముఖ్యం కార్యకర్త హృదయోద్భావన.
జీవనసంగ్రామంలో స్వకర్మ కెంతదూరమైతేనేం ప్రధానం హృద్గతభావం.

ఇక యుద్ధం యింకా అపవాదం. యుద్ధప్రేమికుడెవడూకాదు.
ఐనా సింహద్వారంకడ శత్రువు గర్జిస్తుంటే
ప్రతివాడూ సిద్ధమవక తప్పదు యుద్ధానికి.

ఎంతో కన్నా నీ కనులతో. ఎన్నో విన్నా నీ చెవులతో.
ఐనా ధర్మాధర్మాల రహస్యం ఈనాటికీ గూఢం.
"ఇదిగో యిదిపాపం; యిదిపుణ్యం"
అని గీతగీసి విభజిద్దామంటే ఈనాటికీ చేతగాదు.
ఐతే ఒకటి నిజం! బ్రతకాలంటే కావాలి నరునకు
అగ్నివంటి పరాక్రమం. మండే ప్రతీకార పునాదిపై
సాగెడి ఏ సమరం కాజాలదు పాపం.

ఎవడో నీ హక్కులు హరిస్తుంటే- త్యాగం, తపస్సని జపిస్తూ
కాళ్ళుజాచి కూర్చొనుంటే పాపం. నీపై కురికే దురాక్రమణ హస్తాలను,
ముక్కలుగా ఖండించుటే పుణ్యం.

బంధితుడూ, పీడితుడూ, ఉపాయహీనుడు
నిట్టూర్పులతో సరిపుచ్చుకొను టతిసహజం.
నరాలబిగువూ, కరాలసత్తువగల నరునకేం కర్మం దీనంగా బిచ్చమెత్త?

నిజం! నిస్సందేహం! నింద్యం సంగ్రామం.
విభిన్న స్వార్థాలను ఘోర; కఠోర, వజ్రసంఘర్షాగ్నుల
ప్రజ్వలనం అంతమవందే విశ్వంలో అనివార్యం సమరఘోష.

తప్పనిదానికి తపించుట వ్యర్థం. శోకించిన ఫలంసున్న.
నీ ఒక్కడు మానుకున్న ఆగబోదు యుద్ధం.
ఏదో ఒక సాకుతో సాగితీరు సమరం.

పాండవులు భిక్షుకులవగానే ఆగదీ సహజ విస్ఫోటం. విధ్వంసంతో
ఢీకొన సిద్ధం. నలుదిశలా మూగిన కృద్ధగ్రహాలు, ఉపగ్రహాలు.

ఉన్నది యింకో ధర్మ రహస్యం.
భవిష్యత్తు ముంగిట దేనికింక దాపరికం!
రెండు దినాలు నిలిచా మరణశయ్యపై
పోతున్నా నిపుడీ జగత్తు వీడి.
క్షమా, కరుణ, తపస్సులు నరుని వ్యక్తిగత ధర్మం.
వినయం, త్యాగం సయితం వ్యక్తి కలంకారం.
సమూహ సమస్యల్లో మాత్రం సాగవీ తపాలూ, త్యాగాలూ

నీ ప్రాణాల్లో నిబిడమైన జగన్మంగళ వ్యక్తిత్వం
రోదిస్తున్నది కౌరవ హననానికి. ఆ వ్యక్తి సమీపానే
సమకూడిన సమూదాయపుటెద శోధించిన పిదప అనగలవా?
–మహాభారత మనివార్యం కాదని–

సర్వస్వం కోలుపోయి, భిక్షుకులై పాండవు లరణ్యోన్ముఖు లగుతరి
అన్యాయ విరోధులు, పాండవ మిత్ర సమూహాన్నడిగిచూడు.
ఈ కృత్యం వారి కుక్షి నెట్లు దహించిందో.

మానవ సద్ధర్మ సూత్రబందీవై స్వపత్నీ లజ్జాహరణం నిజ నేత్రాలతో
ఖిన్నుడవై తిలకించావప్పుడు. (ద్రౌపది మానం
పాండవ పక్షీయుల అభిమానం ఒకేసారి హరింపబడసాగెను.)
ఆ రోజున చేశావా కించిత్ సాయం? ఆఁ! కొంచం వచించు!
నీదాపుణ్యం; భీముని నేత్రాల్లో మండిన క్రోధాగ్నిదా?

పిరికిపంద పలుకులతో నను మండించకు.
నేటి వరకు, ఈనాటివరకు నా ఆదర్శం వీరత్వం; బలిదానం.
స్వజాతి ఆలయాన శౌర్యం హారతిగా జేసి
వెళుతున్నా నీ విశ్వం వీడి, రణ విమానా రూఢుడనై.

త్యాగం! తపస్సు! బిక్షాటన! నాకూ తెలుసునోయ్ చాలా;
నేనూ విన్నా నీ మాటలు. 'త్యాగం, తపస్సు, భిక్షాటన'
అవన్నీ యోగుల బైరాగుల ధర్మాలు.
కాదంటే ఎవడో అస్త్రవిహీనుని శ్రీరంగనీతులు.

యుద్ధం అను శబ్దం వినుట చాలు గజగజ వణకుచు
ఏడుస్తుంటేమటుకేం? కావాలి జీవితం! ఏమైనా సరే,
మరణం వద్దనుకోను, బ్రతికియున్న బలుసాకు తినొచ్చని భావించే,
ఎవడో ఒక బలహీనుని, నపుంసకుని ముసుగే నీతులు.

త్యాగం, తపస్సు, కరుణాక్షమల మునిగి
ఔతుంది బలీయం మానవ మనస్సు; నిజం!
క్రూర మృగాల ముట్టడిలో చిక్కిన నరునకు మాత్రం
శరీరబల మొకటే ఆధారం.

నీవేదో మనోబలమంటున్నావే- అది శరీరరక్షకు కాజాలదు అస్త్రం.
దాని క్షేత్రం మనోమయధాత్రి. నరుడు వికారలోలుడై పోరాడెడి చోటుకాదు.

శరీర బలప్రధాన సంగ్రామంలో కేవల మాత్మబలంతో
సాధించే దెవ్వరు విజయం? పశుత్వం కత్తిగట్టిలేస్తే
ఆత్మబలపు బలమేమూలకు?

తపంలో, త్యాగంలో నిబిడమైన నిరామయ శక్తిని
వ్యక్తి వరకు మన్నించును. యోగశక్తికీ జగాన ఓడబోదు సముదాయం!

వనిలో మునిపుంగవాస్తికలగని
రాక్షస-హననానికి ప్రతినబూనె శ్రీరాముడు.
"మతులు చెడ్డ మానవోద్ధరణ కుపాయం
శస్త్రప్రయోగ మొకటేనా?" అని
ప్రశ్నించెను కోమలి జానకి. "కాదు ప్రేయసీ కాదు!
తపస్సూ, త్యాగం సైతం సంస్కరించగలదు నరుని.
ఐతే పతిత నరులకు చేష్టల కెల్లపుడూ తపోశక్త్యొకటే కాదు మహౌషధి".
ప్రత్యుత్తరమిచ్చెను ఘనశ్యాముడు శ్రీరాముడు.

# తృతీయసర్గ

"నిజం ధర్మజా! నింద్యం సంగ్రామం.
మరి శాంతని దేన్నంటారో యించుక వివరిస్తావ్?
అవినీతిని ఆశ్రయమైసైతం అమాయకత ప్రదర్శించు 'శాంతేనా' శాంతటే?

"సౌఖ్య పంపదల, అపార రాసుల శక్తి, యుక్తి, మోసాలతో
సంగ్రమించి, సంగ్రహించి, క్షుధితుల గ్రాసం గ్రహించి,
బలహీనుల ధనం దోచి "సర్వస్వం చేసుక తనపరం
ఉపదేశించగ సాగు కుశాంతి 'శాంతం! శాంతం! నిశ్శబ్దం!
స్రవిస్తుంది శాంతిధార ప్రశాంతంగ;
నింపకండి హాలహల మీ ప్రశాంత శాంతి స్రవంతిలో;

"కదలకండి, మెదలకండి! త్రాగనిందు మీ గుండెల నెత్తురు నను!
వర్ధిల్లాలి శాంతి సామ్రాజ్యం! మీరూ బ్రతకండి; నను సైతం బ్రతుకనీండి!"
"నిజం సమస్త శాసన శక్తుల కధినాధుండైన ఘనుడు
కాడూ మరి శాంతిదూత? ఎందుకవడు సాధుజనుడు?
సమరంతో పనేమి టా మహాత్మునకు?

"నీతి, న్యాయం పునాదిగా సమాజ సమస్త సౌఖ్యం
విభజిత మవనట్టి భూమి; కృపాణ భయగ్రస్తయై
అశాంతి అణగి మణగి చరించు భువిలో;

"అవినీతే నీతిగ పాలించే పాలకశక్తుల పాలనలో;
అక్రములూ, అవినీతులు సమాజ సూత్రధారులై విహరించే భువిలో;
నీతిపూర్ణ ప్రస్తావన కాదరమే లేనిచోట;
సత్యసంధు లురిశిక్షలతో సన్మానితు లగుస్థలాన;

"పశుబల ప్రయోగ మొకటే పాలన సాగించుచోట;
అణగారిన క్రోధంతో
ప్రతి నరహృదయం లోలోపలె రగులుచోట;

"సహించి సహించి అన్యాయం, సజ్జనజన హృదయం
కుమిలి, కృశించి, నశించెడి చోటున; ప్రతి నరుడూ తన్నుతాను
అసమర్థుడు నపుంసకుడని నిందించుక బ్రతుకుచోట;"

"ఈర్ష్యాహంకారాల నిరంతర సంగ్రామం సాగే సీమన;
నివురుగప్పు నిప్పువోలె ఉపరితలం శాంతి కాంతి,
గర్భంలో అగ్నికణం అనవరతం రగులుచోట;

"రాబోయే విస్ఫోటం కాలపు వదనంపై కాంతులు
విరజిమ్ము చోట; పరవశ జన మన భావం
అనలంబై సంకేతాల్లో అనవరతం వ్యక్తంబగు భువిలో;"

"గ్రహించి సైతం గ్రహించ దలచని పాలకు లేలే రాజ్యంలో;
దుర్మతులై చీటికీ మాటికి అగ్నికి ఆజ్యం చేర్చెడి పాలనలో;
"ఒకప్పుడు నూతన పీడనతో, మరొకపుడు నిర్లక్ష్యంతో,
మరొకపరి అవమానంతో వేరొకతరి గుండెలు చీల్చే వ్యంగ్యోక్తులతో,"

"అణగిమణగి లోలోపలి రగిలెడి ఆవేశం బొకరోజున
కట్టలు తెగి ప్రవహిస్తే; త్యజించి సంయమం,
నరు డన్యాయంపై ప్రళయరుద్రుడై లేస్తే;

"ఆ దారుణ కల్లోలానికి, సమస్త విశ్వసంక్షోభానికి,
ఎవరంటావ్ బాధ్యులు? ఆ మారణ రణ కారణమెవ్వరు?
అహంకారమా? ఈర్ష్యా? "ఈ జగద్దహన కారకుడవు
నీవే ననుకుని, విషణ్ణుడవై విలపిస్తున్నావ్.
కొంచెం యోచించి చూడు. ఈ సమరాగ్నిని వర్షించిన దంబర మంటావా?

"కాకుంటే ఈ మంట తటాలున పుడమి బ్రద్దలై వెడలిందా?
కాదంటే ఏ మంత్ర మహిమ వెడలించిందీ జ్వాలను?
"కురుక్షేత్ర సమరాత్పూర్వం సాగుట లేదా సమరం?
భయానక ప్రతీకారజ్యోతులు జ్వలించేవి కావా ఎద ఎదలో?

"ఖడ్గం ధరించి కరాన శాంతి నిషేధిస్తోం దా క్రాంతిని?
ఐతే నిశ్చయ మిది గ్రహించు.
అది చేస్తున్నది మరో సమర సన్నాహం మాత్రం.

"సుఖభోగంలో నరు లందరు సమభాగులు కానంతవరకు
అసంభవ మీ భువిలో శాంతి. ఎవడూ కారా దత్యధిక భోగి!
ఏ నరుడూ కాకూడదు జోగి!

"సిసలైన ప్రశాంతి త్యజించి శారీరక క్షేత్రం
స్థాపించును హృదయ సామ్రాజ్యం. సాగించును రాజ్యం
నరుని మహోన్నత విశ్వాసంపై, శ్రద్ధాభక్తులపై, పవిత్ర ప్రేమలపై!

"శాంతికి ప్రథమాధారం న్యాయం.
న్యాయశూన్య సౌధం ఔగాక సర్వాంగసుందరం
శాంతి సౌధ మేమాత్రం కాజాలదు సుదృఢం.

"తన నీడను గని తానే గడదడమని వణకెడు
సందేహ జీవి కృత్రిమ శాంతి. ఖడ్గం వినా మరే పదార్థంపైనా
శూన్యం దానికి విశ్వాసం.
"ఈ కుటిలశాంతి రాజ్యంలో సుఖభోగం సులభమైన నరులకు
శాంతే జీవనసారం; ఐతే సిద్ధి దుర్లభం.

"ఎముకలు కొరుకుచు నెత్తురు పిండుకు త్రాగుచు,
జీవించెడి కుటిలశాంతి కెరలై కుమిలెడి జన మనతాపం
గ్రహించు మొకపరి.

"అర్థిస్తే లభించవు హక్కులు! సంఘర్షణ మహాపాతకం!
పీడితజను లేం చెయ్యాలిక? జీవించాలా?
కుమిలి కృశించి నశించాలా? ఏ చెయ్యాలని ధర్మజా! నీ భావం!
"అర్థించిన లభ్యమవని న్యాయోచిత అధికార ప్రాప్తికి
ప్రాణమొడ్డి పోరాడును వీరుడు.
యుద్ధాన్ని జయించో, ఆత్మార్పణ మొనరించో విజయుం దనిపించుకొనును.

'ఎవడంటాడోయ్! సముచిత స్వత్వప్రాప్తికి
పోరాడుట అనుచితమని? ఎవ డనగలడోయ్!
న్యాయరక్షకై ధరించి ఖడ్గం నిరుపమాన ధైర్యంతో, నిశ్శంకగ
చంపుట, చచ్చుట పాతకమని?

క్షమ, కరుణ, తపస్సు, తేజం, మనోబలం వగైరాల, వగైరాల

అర్థహీన వ్యర్థస్తుతి గావిస్తూ ధర్మజా! ఏమిటి నీ
వొనరించే పని! 'నరాంతర్గత భీరుత్వ ప్రకటన మాత్రం'.

"తపస్సేనాడు సహించెను ప్రచండ హింసాఘాతం!
దేవతా సమూహ మేనాడూ దాసోహం బన్నది దానవులకు!

"ఉజ్వల పౌరుషాన్ని మించి నీ కంతటి ప్రియమైతే మనోబలం
ఎందుకు లోబడ్డావోయ్ భరతరాజ్య వైభవ లోభానికి?
తిరోగమించావేం వనం నుండి?

గరళం మ్రింగెను భీముడు; జరిగెను లాక్ష గృహ దహనం;
అడవులపాలైతిరి సర్వులు; జడముడి వీడిన ప్రేయసి
నిండు సభామధ్యంలో 'దాసీ' యనిపించుకొనెను

"క్షమా కరుణ లన్నావ్! తపస్సు,త్యాగాలన్నావ్!
మనోబల మన్నావ్! యింకేమో అన్నావ్! ఐతే ఒక్కమాట.
నర వ్యాఘ్రసముడు దుర్యోధను డైనాడా సుయోధనుడు?

"శత్రు సమ్ముఖాన క్షమామూర్తివై, వినమ్రుడవై
ఒదిగి, ఒదిగి నడచినకొద్దీ కౌరవ దుష్టు లేమని
భావించిరి మదిలో? '-వట్టి పిరికి పందలని మాత్రం'-

"అత్యాచార సమనానికి దుష్ఫల మిదియే.
పౌరుషం, పురుషత్వం కోమలుడై కోల్పోవును నరుడు.

"గరళం గల భుజంగానికే శోభించును క్షమ.
దంతహీన, విషహీన, సరళ, వినమ్ర సర్పంకడ ఏమున్నది క్షమకు విలువ?

దారి జూపమని అర్థిస్తూ, మూడు దినాలు సాగర తీరంలో
పడిగాపులు గాచెను రఘురాముడు. అనునయ వినయాలతో
స్తోత్రాలు, దండకాలు పఠియిస్తూ పూనెను హఠయోగం.

సాగర గర్భంనుం డొక పలుకైనా వెలువడనిమి గని
శ్రీరాముని శరంలోన భగ్గుమనెను దుస్సహ పౌరుషాగ్ని.

"మరుక్షణం సంద్రం ధరించి దేహం 'త్రాహి త్రాహి'యని పలుకుచు

శరణు కోరె శ్రీరాముని చేసెను పదకమల సేవ.
స్వీకరించె దాసత్వం. జడబంధన బంధితుడయ్యెను.
"నిజ మిది! వినయదీప్తి నిబిడమైంది శరగర్భంలో.
జయించెడి ధీమాగల ధీరుని సంధిపలుకులే సంపూజ్యం బీ యిల.

బలదర్పం మెరసెడి మనుజుని గని మాత్రమె
సన్మానించును లోకం బాతని సహనం, కరుణా, క్షమలను.
"ప్రతీకార సామర్థ్యం లోపించిన తావున వ్యర్థం. క్షమ.
గరళం దిగమ్రింగెడు కుంటిసాకు. మాటల మహేంద్రజాలం.

"క్షమాశక్తి తెరచాటున భీరుత్వం దాచుకొనెడి
పిరికిపంద కేం తెలుసు? –పౌరుష పూర్ణంబగు జ్వలితప్రాణి నరుని ధాటి–

"స్పృశించుట చాలు– హృది నుండి శిరంవరకు
ఆమూలాగ్రం భగ్గుమనెడి ప్రచండ దుస్సహాగ్ని
ఎంతెంత రగులుతుందో నరునిలో ఏం తెలుసా పందకు?

"భుజనాళా లేనాడూ జలదరించు టెరుగని నరుడు,
ఉడుకు నెత్తురే శూన్యంబగు మానవుడు,
శివ చరణామృతపానం వినా హాలహల పరిచయమే లేని ప్రాణి,
హృది నెపుడూ అగ్నే రాజని వ్యక్తి,
ఎదురు దెబ్బ కెరయై సైతం అహం జాగృతం కాని వ్యక్తి,
బాహుబలంపై విశ్వాసమె లేనివాడు మాత్రమే
బైఠాయించును కాళ్ళు జాపి– 'ఆత్మశక్తి, ఆత్మబలం' –బని జపియిస్తూ.

"దెబ్బతీయ చేతగాని అసమర్థుని క్షమకూ, సహనానికి
విలు వేమున్నది? శాత్రవ మూకలపై ప్రతీకార మొనర్ప నసమర్థు
న్నకేమున్నది అన్యోపాయం? –కరుణ, క్షమల జపం వినా?–
నాళాల్లో పౌరుషమే ప్రవహించని ఎవడో అసహాయుడు,
భీరుడు మాత్రమే సహియించు ప్రహారాలు.
పుంసత్వం కోల్పోయిన జాతి కళంక మీ కరుణా, క్షమలు.
లేదా శూరుల, పరాక్రముల శృంగారా లివి.

"శౌర్యజ్వాలల కాధారం ప్రతీకారం. ప్రతీకారహీనత మహాపాతకం.
పౌరుషాగ్ని తాపం శేషించని దీనుడె త్యజించి ప్రతీకారభావం దిగమ్రింగును

అవమానం ప్రశాంతంగా! కరంలో దృఢచాపం,
నిషంగాన వాడి శరం గల మొనగాడే విధి సహించు ఆఘాతం?
క్షమా, సహనాలు విజయుని ఆ భూషణాలు నిజం!
పరాజిత జాతికి మాత్రం సహనం అభిశాపం.

"ఎటనైనా సరె ఒక్క తృణస్పర్శ చాలు.
తక్షణం దాల్చి భయానకరూపం బుసగొట్టుచు లేచును భుజంగం.
విపినంలో ఎటనైనా సరె గజేంద్ర ఘీంకారం పడుట చాలు వీనుల.
మరుక్షణం హుంకరించు మృగేంద్రుడు గుహలో.
గ్రుచ్చుకొనును కంటకాలు. దహిస్తుంది అనలం.
ధాత్రిని విలీనమొనర్ప యత్నిస్తూ గర్జించెడి మహా సాగరం వీక్షించావా?
జగత్తులో అడుగడుగున ప్రతీకార జ్వాలలె ప్రత్యక్షం.
జడ చేతన సమస్త శక్తుల జన్మసిద్ధ అధికార మీ ప్రతీకారం.

"పరహక్కుల స్వాహాచేయగ సైన్యాలను మోహరించుట
అతి నీచం, లోభం నిండిన సమరం క్షాత్రధర్మ ప్రతికూలం.
జనియించదు పుణ్యం విషయవాసనాజాలంలో.
వణిజుని కృపాణమే అపవిత్రం.
దెబ్బతిన్న మృగరాజు మేల్కొని లంఘించును గర్జిస్తూ.
భయానక ప్రతీకారభావం జాగృతమై విజృంభించు.
అప్పుడు వికసించును. ధర్మం చంద్రహాస ధగధగలలో.
పౌరుష ప్రజ్వలనంబే ధర్మయుద్ధ మన బరగును.

"ప్రచండ వేగంతో వీచెడి వాయువు నాహ్వానించెడి పనేముంది లోకానికి?
వాయు స్పర్శయె తరువాయిగ భగ్గుమనుట హుతాశన ధర్మం.
అగ్ని పర్వతాల సమున్నత కంఠాగ్రం
ప్రేలితీరు ఏదో ఒక గడియన; వదనంకడ కూర్చుని
గగ్గోలొనరింపగ పనేముంది విశ్వానికి?
బుసగొట్టి దహిస్తుంది భుజంగ మీ జగాన్ని;
ఎవడి కేం పని దాని గిచ్చి గిచ్చి రెచ్చగొట్ట?
ఉద్దీప్త అభిమానంపై దెబ్బతీయ పనేముంది?
ఖగోళ మవశ్యం వర్షించును పిడుగులు!

" సమరాహ్వనకు లెవరంటావ్? అవినీతి ధ్వజారోహకుడా?

అవినీతి నొసటి పై కసకస నడిచేవాడా?
శోషణ పాషాణ శిలల జిక్కి నలిగి నలిగి నులియయ్యెడివాడా?
ఠీవిగ నిల్చుని పగలబడుతు పచారు చేసెడివాడా?
రచించి 'శాంతి' వ్యూహం సుఖాలు దోచేవాడా?
అశాంతులై నకనకలాడెడి అసంఖ్యాక క్షుధార్తులా?
ఎవ్వరు యుద్ధోన్మాదులు? వలలుపన్ను తులువా? ఆ వలలను
ఛేదించగ కాలునివలె లంఘించెడి క్రోధితుడా ఎవడంటావోయ్?

"జాగృత పీడితజన కృపాణ మెపుడూ కాజాలదు పాతకి.
పాతక మారోపించుట దార్శనిక భ్రమ మాత్రం.
దోపిడీల కాపాడగ నిర్మించే శాంతిశృంఖలాల్లోనే
నిబిడమైంది నిజానికి– భీషణయుద్ధం; ఘోర అశాంతి.
దాని సహించటం మౌనంగా మానవతకే పరాజయం!
అవమానం ఈశునకే. శాశ్వత శ్రాంతి పురుషత్వానికి.
మానవుని మహాపాతకం. మనుష్యత్వమరణం.
ఈ సంకెళ్ళలో నరధర్మం తిరుగుబాటు; మహాక్రాంతి!

"ధర్మజా! విస్మరిస్తున్నా వొక విషయం
ఇప్పటికీ హింసామయ మీ భూలోకం.
నలుమూలల విలయతాండవం చేస్తున్నది
దురహంకారం. నల్దిశలా మోసం, కపటం చేస్తున్నవి రాజ్యం.

"తల బ్రద్దలు చేసుక నేనూ యోచిస్తున్నా–
ద్వేషం, ఈర్ష్య, విద్రోహంబీ భువిని వీడు తెర వేదామని;
కరుణా ప్రేమ యహింసలు పృథివిని పాలించెడి విధ మేదాయని;

"పరస్పరం భ్రాతృభావ పూరితులై బ్రతుకులు గడిపెడి గతి ఏదాయని;
క్రోధాగ్నులు శమించు పథ మేదని, సంగ్రామం
సమసెడు విధ మేదని–నేనూ యోచిస్తున్నా.

"సమస్త భూలోకం బగుగాక స్నేహ సామ్రాజ్య పీఠం!
సహజ, సరళ ప్రేమాగార మవాలి జీవితం.
దహించెడి ద్వేష విషం నశించాలి నర ప్రకృతిలో శాశ్వతంగ.

"ప్రవహించాలి ప్రవాహమై ప్రేమం మునకలు వేయాలా ప్రవాహాన

ప్రతి మనుజుడు నిరంతరం. నరులందరు పరస్పరం
తమ హృదయ క్షేత్రాల్లో విత్తాలి ప్రేమ బీజాలు.

"కాని జగత్తింతవరకు సగంవరకె పయనించెను.
శాంతి స్వప్న మీనాటికి ఎటనో-దూరంగా
ధగధగ మంటున్నది గగనంలో.

"పోరబాటున మాత్రమే దర్శనమిస్తుం దా ఆదర్శం.
ఏ యుధిష్ఠర ప్రాణాల్లో మాత్రమే ధరియించును రూపం.
"కాని, ద్వేషశిలా నిర్మిత దుర్గంతో ఢీకొని మాటిమాటికీ,
ఉక్కు కవాటం మరిపించెడి బంధిత మానవ మనస్సు నెదుర్కొని,
"ఈర్ష్యా, కలహం, విద్వేషం వగైరా తాపాలకు వ్యాకులపడి
ఒకరిద్దరి ఎదలను మాత్రం ద్రవిత మొనర్చి అంతర్హితమగు.
"ఎందుకనో తెలుసా? యింకా ఈ భువిలో యుధిష్ఠరు డొకడే.
దుర్యోధనులసంఖ్యులు. ఎలా జరుగుతుంది.
శాంతిలతా ప్రగతి? ఉంటేగా పోషక ద్రవ్యం!

"హృది హృదిలో పరిశుద్ధ సరాగం
ప్రతిధ్వనించనంతవరకు- అంతవరకు మ్రోగదు
శాంతి విపంచి సుస్పష్ట, సునిశ్చిత, సుందర రాగంతో.

"గగనంనుండి దిగేందుకు కాదది భారరూప బాహ్యోపకరణం.
ఆత్మజ్యోతది. నిశ్చల. నిర్మల, నిష్కల్మష అంతరాత్మ ప్రకాశ మది.

"కత్తికి భీతిలు తనువే కాదు; మనుజుని మెత్తని
హృదయం సైతం మన్నించెడి, ప్రేమంతా తొణికిసలాడే
సుందర పథమే శాంతి పథం.

"కుమ్మరింట నిర్మితమగు బొమ్మకాదు శాంతిదేవి.
అవతరించు అనవరతం బది పవిత్ర నరహృదయంలో.

"విషం, విద్రోహం, నానావిధ ప్రళయ హేతువులు.
సమూల విధ్వంసనమైన రోజు మనుజ ప్రకృతే మారును పూర్ణంగా.
సుశీతల శాంతాకారం ధరించు సంపూర్ణంగా.

"శాంతే ఉదయించిన రోజున శేషించదు భీతావహ భువిలో.

సందేహాంధకార బందీయై బ్రతికెడి దేశం మచ్చుకైన దొరుకదు.
"సమతను ప్రతిపాదించెడి శాంతి! సుశీతల శాంతి!
ఏదీ? ఎచ్చట నున్నది? అదుగో! చూడటు!
నేడది రక్షిస్తున్నది అక్రమాన్ని! అవినీతిని!

"అమాయక వదనం, సుమధుర వచనం,
శుభ్రవసనాచ్ఛాదిత దేహం! యుధిష్ఠిరా! జాగ్రత! జాగ్రత!
కా దది శాంతి; విషదంష్ట్రాన్విత ఉరగం!

"నృపాలురతో క్రిక్కిరిసెడి జరాసంధు కారాగారం బది.
ఒకప్పుడు రుధిరం, మరొకతరి తప్తాశ్రుజలం పానీయం దానికి...

"కురుభూమిలో దగ్ధమైన ప్రేతశయ్య కాదది శాంతిది!
పార్థుని ప్రచండ గాండీవ ప్రకోపం కాజాలదు దుష్ట విప్లవం.

"సమరాగ్నిలో భస్మమైంది పరగ్రాసం గ్రసియించెడి విషోరగం.
కిరీటి శరజాలంలో రగిలిం దసహనశీల పౌరుషం.

"కొంతైనా పాలు పంచి జీవించుట నచ్చని 'ప్రశాంతి' పై
ప్రాణాలను పణంబెట్టి ప్రళయకాల రుద్రునివలె
తెగించి లంఘించెను పురుషుడు.

"ఎవడు పాపి? సాటి నరుని న్యాయోచిత సత్త్వం
హరించు ఘనుడా? న్యాయ సాధనాపథ అవరోధపు
శిరస్సు ఖండించెడు మహామహుడా? ఎవడు పాపి?"

# చతుర్థ సర్గ

బ్రహ్మచర్య వ్రతి, ధర్మాధార స్తంభం, మహాశక్తి నిలయం.
పొందియు సైతం బాతని
పొందలేని ఈ లోకపు పరమ విరాగి పురుషుడు!

త్యజించాడు మకుటం ధర్మానికి; విసర్జించె ప్రాణం ప్రేమానికి.
భీష్ముని మించిన పరాక్రమి పురుషుడు యింకెవ్వడు ఈ ధరిత్రి వేరొక్కడు?

శరాల వాడి శిరాలపై పవళించిన గజేంద్రుని వలె,
అలసిన, గాయపడ్డ గరుడునివలె, శిథిల సర్పరాజువోలె
అనంత వీర జీవన బలభారం మృత్యువు నెత్తికెత్తి కాలునే సవాలు జేసి
శ్రమించి గడించె స్పృహపై అధికారం.

సమరచరిత వివరించగ సాగెను. పితామహుడు కుంతీసుతునకు.
వ్యథలను సమకూర్చగ సాగెను వరుసగ భావపరంపరలో.
మథితంబై హృదయ సముద్రం కల్లోలంతో తల్లడిల్లు వేళల
వెల్లడించు గంభీరుడు సైతం తన మనోంతర్గత వేదన...

"న్యాయ చోరుడౌ నరుడౌ స్వాగత మొసగును సమరానికి
యుధిష్టరా! హక్కులకై పడు ఆరాటం
కాజాలదు పాపం. పాపానికి తలవంచెడు వారికె
ప్రాప్తించును రౌరవనరకం. రణరంగ ప్రాంగణాన
పాపంపై సవాలొనరించెడి వారల నంటజాల దేమాత్రం.

"సహజంగానే వాంఛించడు ఏ నరుడూ సాటి నరునితో సమరం.
సాటినరుని చంపగ, స్వయముగ చంపబడగ
మనుజుడు సహజంగానే విముఖుడు.
కుహనా శాంతిని సైతం భగ్న పరుప వెనుకాడును నరుడు.
చేతనైన మేరకు నిలబెట్టగ జూచును శాంతిపైని గల తన మమకారం.

"ఐతే ఈ శాంతి ప్రియత్వం అరికట్టును నరులను మాత్రం.
ఆపజాల దేమాత్రం బది దురాచార దానవులను.
రక్కసు డెపుడైనా మనుజుని మన్నిస్తాడా?
భావిస్తాడాతడు వినయం పారుబోతు నీతని.

"కాలం గడిచినకొలదీ విషమించగ సాగును స్థితి గతి.
అవినీతి శృంఖలా లంతకంత కత్యంత బలిష్ఠమై
దాల్చును కర్కశావతారం. ఆ దశలో ఏదో ఒక దినమున
బ్రద్దలవక తప్పదు మరి ఏదో మహా విస్ఫోటం.
ప్రాణాలను పణంబెట్టి విరుచుకుపడి తీరునవశ్యం మనుజుడు దనుజునిపై.

"విజయుడు, పరాజితుడు వీరిరువురు మాత్రమే
బాధ్యులు ఈ అని కని భావించకు మదిలో.
యిద్దరు వ్యక్తుల అనలంతో దగ్ధమవదు సమస్త భువనం.

"యుధిష్ఠరా! హఠాత్తుగ ప్రేలేనా అగ్ని పర్వతం?
మేఘశూన్య గగనం వర్షిస్తుందా పిడుగులు?
అవనీగర్భంలో చెలరేగిన తాపానికి బ్రద్దలౌను హుతాశన శైలం.
భయానక మేఘావృత గగనంలోనే ఫెళఫెళ మను పిడుగులు.

"రెండు గ్రహాల ఘర్షణ మాత్రమే కాదీ మహాభారత సమరం.
అగణిత జనమన అనలంబీ సమరానికి పూంజీ.
కురువంశీయుల ఘర్షణ ఫలితంగా కలిగిన
దుష్ఫలితం కాదిది. సమస్త భారతవర్షపు
మహా వికట విస్ఫోటం బిది.

"యుగయుగాల నుండీ విశ్వంలో వీస్తూ వచ్చెడు విషవాయువు.
సహించుచు వచ్చెను దవానలం, మౌనంగా ధరాతలం.
పరస్పరం పగ సాధించగ సర్పులు పొంచులేసి బైఠాయించిరి.
సమరానికి సాకు వెదకుచూ సతమత మవసాగిరి సర్పులు.

"ఎవడి పరాక్రమమో గని కనజాలక ఉడికెడివాడొక్కడు.
ఎవడో క్రూరుని కెరయై క్షోభించెడి దింకొక్కడు.
ఏ అవనీశుని అభ్యుదయమో వేధించగ సాగెను నృపులను.

ప్రతీకార భుజంగాన్ని పాలుపోసి పెంచసాగె మరొక్కడు.

"తన ఫల్గుణ హనన ప్రతిజ్ఞ చెల్లించగ వేచియుండె రాధేయుడు.
ద్రోణునిపై గల తన పగ సాధించగ తహతహపడసాగెను ద్రుపదుడు.
పితృరుణం చెల్లించెడి తెర వేదని కురుకుల పతాక
మట్టిగలుపు విధ మేదని మాత్రమె ఆలోచన శకునికి.

"సుయోధనునిపై వాత్సల్యం బాతని కిసుమంతయు శూన్యం.
మహాఘోర మోసం బది. ఆతని హితుడని భావించుట
మండే అనలంతో చెలగాటం.
ఈ విధి ఎట గాంచిన అట రాజసాగె అనలం.
సమరంలో భగ్గుమనగ అహోరహమూ తహతహపడసాగెను.

"శ్రీకృష్ణుని సంస్కరణలె గిట్టని నృపులంతా క్రోధితులై
కూడిరి ఒక కూటమిగా. శిశుపాలుని వధతో
వారల అభిమానం బారలేదు. ద్విగణీకృత దురభిమాన ధూమం
అణగి మణగి మాత్రం పడియుండెను అడుగున.

"పరస్పర కలహం, వైరాలతో ఎప్పటినుండో విడివడసాగిరి
వేరువేరుగా. రెండు ముఠాలుగా సాయుధు లవసాగిరి సర్వజనులు.
హృదిలో మండెడి అనలం ధరించి ఒరకత్తుల చేత దూసి
నారిని సంధింపజేసి సిద్ధమైరి వా రందరు.

"హాలాహల లక్షణ మేదైనా కాకుంటే పూర్ణం
యుధిష్ఠరా! చేసెను పరిపూర్ణం నీ రాజసూయయాగం.

"నరుడు వాంఛించెడి దొక్కటి; నియతి ప్రసాదించునది మరొకటి.
ఫలిస్తాయి అమృత వృక్షంలో విషఫలాలు. అవర్ణనీయ మీ నియతీగతి.
"రాజసూయ మిషతో నిను రారాజుగ జేసి వేసి
సమైక్యతకుచితోపాయం బూహించెను శ్రీకృష్ణుడు.

"ఐతే వేరొక టయ్యెను తత్పరిణామం. భగ్గుమనెను భువనంలో అనలం.
పరాజిత రాజుల మనముల అంకురితంబయ్యెను ద్వేషం.
"కాలేదవగాహన వారికి శ్రీ కృష్ణుని నిష్కల్మష సద్భావం.
వా రట వీక్షించినదల్లా ఇంద్రప్రస్థ పురవిభవ బలాభ్యుదయమే!

"పూజనీయ వ్యక్తిని పూజించుటలో అడ్డువచ్చె నా బాధలె-
అదే మనుజ దురహంకారం; అల్లదే నరుని భ్రాంతి.

"ఇంద్రప్రస్థ మకుటం, ఛత్రం ఆభూషణాలు భరతావని కంతకు.
వానికి ప్రణమిల్లుటలో కలిగెడి తలవంపులు ఏమున్నవి ఎవరికైనా!
"ఐనా వ్యథ కలిగెను అనేకులకీ నిష్కళంక మనస్సులకె.
భ్రాంతికి లోబడిన బుద్ధి సరితూచెను దీనిని గౌరవ హననంతో.

"వీక్షించిరి వారీ సన్మానంలో తమ వివశత్వం.
వీక్షించిరి పరుల ప్రతాప వైభవాభ్యుదయాలలో తమ పరాధీనత్వం.

"అగుపించెను వారికి రాజసూయ యాగం ఔక రణకౌశల ప్రదర్శనంవలె;
నిజ విస్తృతి వాంఛించెడి చతురనృపతి కుతంత్రంవలె.

"ధర్మజా! ఎవడూ కోరడు తన అహం వదలుకొనగ.
ఏ నరుడూ సిద్ధపడడు మరో యితర శక్తి ముంగిట
సుహృదుడై శిరము వంచ.
"నీ ధ్వజచ్ఛాయ చేరిన వారందరు చేర లే దనురాగంతో.
ఏతెంచిరి కొందరు భక్తితో. విచ్చేసిరి మరికొందరు అసిధారకు భీతిలి.

"భావం బేదైతేనేం! సర్వుల హృదయాలకు
పరిచయ మొక విషయం. ఈ ప్రణతులతో మాత్రం
మకుట గౌరవం కాజాలదు అక్షుణ్ణం.

"తోచెను వారికి దాసత్వం నెత్తి కెత్తబడుతున్నట్లుగ;
రాజసూయ మధ్యనుండొక మహా సామ్రాజ్యావిర్భావం
జరిగిపోవుచున్నట్లుగ.

"అగణిత భూపాలుర, అసంఖ్యాక శూరుల, దిగ్గజాల,
బలవైభవ సంపన్నుల అభిమానం హసన మొనర్చెను యాగం.

"నిజమే! సన్మానించావ్ నిండు మనంతో
అనునయ వినయాలతో, సమతా శీలాలతో,
మంజుల మధుర వచనాలతో, అతిరథులైన అవనీశుల నందర.

"ఐతే యివి ఎన్నయినా చాలవు. సరితూగవు

స్వతంత్ర మణి మూల్యానికి.
సతతం మానసాస మరిగెడి భావం మాయజాల దే మాత్రం.

"ఎవడో మూర్ఖుడు మంద బుద్ధి నృపు డైతేనే-
తృప్తి చెందు తీయని పలుకులతో; సంతుష్టుండగు
విజయుని విశిష్టతా, వినయాతలతో; సంతృప్తుండగు
శాత్రవ కౌగలింతలకు.

"శత్రుభీతి నేదో విధి శాంతపరచి బాహ్యాలింగన మొనరించును
నిపుణ నృపుడు. అంతేకా నెంత మాత్ర
మవనీయడు హృదయం శాత్రవ హస్తగ్రస్తం.

"యజ్ఞంలో ప్రేమకాస్క లర్పించుటతో
శాంతచిత్తులవలే దవనీశులు.
వీడిరి యింద్రప్రస్తం మరేదో వేరుభావమే మనమున నిడుకొని.

"ధర్మజా! వ్యాసుని గంభీరపు వచనా
లున్నాయా స్మతిలో? యజ్ఞాంతంలో
మహర్షి ముఖంగా వెడలిన భయంకర భవిష్యవా ణేమిటి?

"-గగనంలో ఏర్పడుతున్నది కుటిల గ్రహకూటమి.
బహాశా బలి కానున్నది జగత్తు మరో మహా సంగ్రామానికి.

"పదమూడేండ్లేదో విధి వర్థిల్లును శాంతి జగంలో.
తదుపరి బ్రద్దలౌను విస్ఫోటం. చెలరేగును మరో ఘోర సంగరం.
"ఘటిల్లు మహా విధ్వంసం. కాలం పన్న గలదు కల్లోల వ్యూహం...
ప్రళయం ప్రత్యక్షంబగు ధరణిపైని. వ్యాపించును హాహాకారం!

"వట్టి అంచనాలు కా వివి. సిద్ధుడైన దూరదర్శి వచనా లివి.
అహరహ మీ మహి పయనించెడి దే దిశకో
ఆమూలాగ్రం బెరుగును వ్యాసుడు.
"అంతా ఆనందించిరి యజ్ఞానికి.
కలతపడిన దొక ముని హృది మాత్రమే.
యజ్ఞ హోమగుండం వెడలించిన అనలం బెట్టిదొ
జ్ఞాతం బతని కొకనికే.

"నిండు సభామధ్యంలో హెచ్చరించె నందరనూ.
అడుగడుగున సంయమ నియమ వ్రతులుగా బ్రతుకండని
చేసెను సర్వులకూ మంగళకర బోధలు.

"అహంకారి, రాగోదీప్తుండగు నరు దేవిధి పాటించును సంయమం?
రేపు ఘటిల్లెడి విపత్తు కీ నా డెందుకు భీతిల్లును?

"వర్షమైన గడిచిందో లేదో కాలఘోష వినబడసాగెను.
చుట్టుముట్ట మొదలిడె, నింద్రప్రస్థంపై విపత్కర మేఘా లతిదట్టంగా...

"ఎవడి కెరుక చూస్తూ చూస్తూనే పరుచుకుపోతుం దీ
విధ్వంసం బని? ఎవ దెరుగును భారత దౌర్భాగ్యం...
ముగియించును జూదపు మిషతో నని?

"అనుకున్న దెవడు సుయోధనుని నిబ్బర మీ విధి
దెబ్బకు గురియౌ నని? ఎవ్వ దెరుగు
రాజసూయ హోమగుండం వెలి గ్రక్కును అనలం బని?

ఐనా నిజ మిది ధర్మరాజ్! సరిక్రొత్తది కా దీ కీల.
దుర్యోధన మానసాన ఏండ్లుగ విహరిస్తున్నది.

"రంగభూమిలో విచిత్ర విహంగ వక్షం బే రోజున
కిరీటి శర గురి కెరయయ్యెనొ నాడే జన్మించిం దీ దురగ్ని
దుర్యోధన హృదయాంతరాన.

"ఆ దురగ్ని యో హాలాహల మయ్యెను వంశానికి.
ఆ అగ్నియె లాక్షా గృహ కీలలు. ఆ దురగ్ని ఫలమే
శకునీకృత మాయద్యూతం. ఆ దురగ్ని పరిణతియే
పాండుసుతుల వనవాసపు బాధల గాథలు.

"నిండు సభామధ్యంలో హరింపబడినది కాదది ద్రౌపది మానం.
ఆ భయంకరానలమే చెలరేగెను నిర్భీతిగ.

"వివశ ద్రౌపదీ వసనం విప్పుటతో పాటుగనే
నివురు చేత ఆవృతమగు దురగ్ని నగ్నం బవసాగెను.
"ఈడ్వబడిన ద్రౌపదీ కేశజాలములు కావవి.

విరబోసుకు వెడలిన దురగ్ని కేశా లవి.
ద్రౌపదీ వసన మనంతం; నగ్నంబయ్యెను కేవల దురగ్ని నిజరూపం.
"అడ్డు నిలిచె దుస్థితిలో ఆ సాధ్వి తపోబలం ప్రాకారంవలె.
ఆ సతీమతల్లి చేలాంచలం, ఉజ్వల జాజ్వల్యమాన ప్రకాశమై వెలుగొందెను.

"కానీ దుర్యోధన దురగ్ని నగ్నంగా నాట్యమాడసాగెను.
పరీక్షించసాగెను నిజ లజ్జాహీనత్వపు, దేశ పౌరుషపు లోతుల నతి లోతుగ.

"ఐనా మరి ఆ దినాన ఎందుకనో తెలియరాదు
నీవూ, నేనూ ఉభయులమూ పరాజితు లైతిమి!
ఎందుకనో తెలియదు మరి భుజ నాళాలను చీల్చుక
వెల్లువలై పారలేదు రుధిరధార!

"నరుని కీర్తి పతాకం బా నాటితో నరుక బడెను సమూలంగ దేశంలో.
నరుని యెడల ఆశలు నశియించిన నారీమణి అర్థించెను సురలను.
"మహా సమర మానాడే కావలసిం దారంభం.
కత్తి దూసి నాడే నెత్తుట కడగాల్సిం దీ కళంకం.

"దుష్ట ద్యూతపు మిషతో నిరపరాధి, కులసతి,
ఏకవస్త్రధారిణి నీడ్చి తెచ్చి మహలునుండి
నిండుసభా మధ్యంలో దాసిగ నొనరించుట!

"అంతేనా! సర్వుల సమ్ముఖాన నిర్లజ్జగ, నిర్భీతిగ లజ్జాంబర హరణం.
విషణ్ణ వీర భారత మేధ ఇసుమంతయు కిక్కురుమనకుండుట.

"ఎవడి మనసు కెక్కును కనివిని ఎరుగని ఈ నవీన ధర్మసరణి?
ఉమియు నవశ్యం మనపై భవిష్య సంతతి.

"నాటి స్మృతి స్ఫురణ ఈ నాటికి దహిస్తోంది హృదయం.
అంతరాన ఎదపై నేదో పిడిబాకు ప్రయోగం
జరుగుతున్న దనిపిస్తుంది.

"ఛీ! ఛీ! దుస్సహ దుర్భర అవమానం నా కిది.
యిడుమలు పడసాగెను సమ్ముఖానె రాజకాంత.
కం డ్లెదుటనె హరియించిరి కాంత లజ్జ నా దుష్టులు.

"ఐనా చావలేదు నేను. బ్రద్దలు కాలేదు ధరణి.
చలించలేదు దిగ్గజాలు. గర్జించలేదు గగనం. పడలే దొక పిడుగైనా.

"జీవిత మంతా జీవించితి నీ జగాన
అనలంవలె ప్రజ్వలితంబై.
నరనరాన ప్రసరించెడి దది కరిగిన అనలం; కా దది రుధిరం.

"అనుచిత దర్పం బెవడిదైన, ఎన్నడైన
కాదిది సహియించెడి ప్రాణం. అన్యాయం బెవనిదైన
మన కేమని వీక్షిస్తూ మౌనం ధరించు మనసు కాదు ఈ మనిషిది.

"మరి నా కే దాపురించె నీ కడిగిననూ విడువని ఘోర కళంకం.
లోలోపలె కృంగి కృశించిన, గొంతు చించుకుని రోదించిన సరె,
అంతమనవి దీ మాయమచ్చ...

"నా వీరచరితపై సవాలు చేస్తూ సెలవు తీసుకుంటున్నా.
ఐతే నీ కొక ఉపదేశం మాత్రం చేసి గతిస్తా.
"మండే అనలంపై నిర్భీతిగ నడచుటె వీరుని ధర్మం.
సానకత్తిపై చరచర కదంత్రొక్కి సాగుటె శూరుని కర్తవ్యం.

"రొమ్ము నిచ్చి అమ్ముకు గరియగు టే వీరధర్మ మనబరగును.
చిరునవ్వులతో జరిపెడి గరళపానమే శూరధర్మ మన జెల్లును.

"అనలం బరచేతిలో రగులజేసి శిర మాహుతిగా నర్పించుటె,
నిరుపమాన బలిదానవు పాఠం
నిఖిల భువికి బోధించుటె శూరవరుని సద్ధర్మం.

"నిత్యం బుజ్వలముగ జీవించుటె అత్యున్నత నరధర్మం.
కూడగట్టి దాహక శక్తుల ఎవ్వని స్పర్శయినా
సహించకుండుటె అత్యుత్తమ నరధర్మం.

"ఆర్పివేసి మేధాదీపం కండ్లు మూసి పురోగమించును వీరుడు.
అధిష్టించు బలివేదిక పై గంతు వేసి తనకు తానె ఆహుతి యగు.
"వీరత్వం బెన్నడైన పొరబాటున వివేకం కడ కేగిందా సలహాకై
పతనమొందు నవశ్యం; గ్రోలును అవమానం; కోల్పోవును నిజ తేజం.

"నిజమే! మేధాకలశంలో నిబిడమైంది జలం;
శీతల సుధాసలిలం. ఐతే మరువకు మీ సత్యం.
కాని వేళ నల్లదియే మారును గరళంగా.
"గుణించ దీ బు ద్ధెపుడూ గౌరవావమానంబుల
నుచిత రీతి. ఆలోచిస్తుం దతి విపరీతంగా ఆర్పును తుద కగ్నికీల.

"ఆ మేధా శక్తియె ఆర్పెను నీ పౌరుషాగ్ని కణం.
ద్రుపదపుత్రి చేలాంచల హరణం
విలోకించి సైతం చిమ్మలేదు నీ కన్నుల నిప్పులు.

"ఆ మేధయే బంధించెను నను దుర్విధలో.
ఒనరించెను పిరికిపందగా. కన్నులు నులుముక వెన్ను విరిచి
లేవబోవు నప్పటి కెపుడో మించిపోయె సమయం చే జారెను అవకాశం!

"శిరం బెత్తి తీవిగ సంధించి శరం తీరుగ
యౌవన మెల్లప్పుడు సాగును జోరుగ.
కానీ దుర్బల వృద్ధాప్యం బానిస యగు వివేకముకు.

"ఉద్రిక్త యౌవనధారను గని ధరించి మౌన ముద్ర,
వంచించి మనస్సును, అణగి మణిగి చరించు నీ మేధ.
నిలుచును నిశ్చేష్టితమై తీరంలో సంశయభారంలో!

"గడ్డిపోచ పోలిక నీ ప్రవాహాన కొట్టుకుపోవుదుమను హడలీ మేధకు.
వెల్లువ కల్లోలభీతయై తనంతట తానే
తప్పించుక తిరుగసాగు తానుగ నిర్మించుకున్న కారాగారంలో.

"హిమవిముక్త నిర్విఘ్న తపస్సులో వికసించును యౌవనం.
నిండును సమస్త భువనంలో నవ్యదీప్తి; వినూత్న సౌరభం.

"నవయౌవ్వన వెల్లువ సన్నగిలున దెపుడాయని,
ఎన్నడు దానిని కబళించెద మని ఎల్లప్పుడు గురిజూచుక
పొంచులేసి కాచియుండు నీ మేధ.

"మరి నిజముగనే రుధిధార వడి యించుక మందగించెనా-
జీవన ప్రవాహ మెటనైనా శ్రమ హరణార్థం విశ్రమించెనా-

"ప్రయోగించు బుద్ధి మరుక్షణమే నిజ మాయాజాలం. చిక్కుకొనును
నరు డా వలలలో. జీవన సమ్ముఖాన ప్రత్యక్షంబగు క్రొత్త క్రొత్త చిక్కులు.

"క్షమయా? ప్రతీకారమా? ఏది మరీ లోకంలో నరధర్మం?
మృతియా? హతమార్చుటయా? ఉచితౌషధ మేదీ వ్యాధికి?

"వివేక, పరాక్రమాలలో శ్రేష్ఠమైన దెయ్యది? ఖడ్గరాజమా? వినయతేజమా?
పూజితమగు రుధిరసి క్త జయమా? కరుణోజ్వల పరాజయమా?

"అంతరాత్మ జ్వాలా? మానస కీలా?
ఏది పవిత్ర మీ రెండిట? శాంతించిన పెద్దతనపు
మంగళకర మానసమా? ఉద్దీపించిన నవయౌవ్వన పురోగమనమా?

"మన మేదో వృద్ధాప్యంబని శ్రద్ధగ చూస్తున్నామే...
తెలుసా నీ కిది? మహాఘోర జీవితవిశ్రాం తది.
అలసిన మృగరా జెపుడూ వెదకును ఆదర్శాలను;
సహించు వ్యంగ్య శరాలను.

"మరో మార్గ మరయలేక వృద్ధాప్యం బెపుడూ
తిరుగసాగు మేధో చక్రాధీనంబై.
విసర్జించి భ్రమజాలం త్వరితోచిత ప్రత్యుత్తర
మొసగలేదు తగు వేళకు.

"అప్పటి కెపుడో కొల్లగొట్టి పౌరుషతేజం
వెళ్ళిపోవు కాలం. నిర్జీవపు వృద్ధనరుడు
చింతా క్రాంతుండై రోదించుచు జీవించును పశ్చాత్తాపంతో.

"భోగిస్తూ వృద్ధాప్యపు ఫలితం అంటుకొనుంటిని ధుర్యోధన గేహానికి.
బంధిత అస్థిపంజరంలో పరితపిస్తు పడియుండెను వీరత్వం.

"సాధించలే దటు- కురువంశీయుల హితం;
యిటు పాండునందనుల శ్రేయం.
దువిధా మధ్యంలో చిక్కు పరిచె నను వృద్ధాప్యం.

"కర్తవ్యం!-అనురాగం! రెండూ ప్రియమైనవె.
నిర్ణయ మతి క్లిష్టం. కనుక నె మరి అర్పించితి

ఒకరికి శారీరం; యింకొకరికి హృదయం.

"ఐతే కారుమబ్బు విడగానే కనుగొంటిని జీవనజ్యోతి.
పొంగి పొరలి ప్రవహించెను సాహస
యిసుక ఎడారిలో ప్రేమ ప్రవాహం.

"పరాజిత మయ్యెను ధర్మం నిజ విజయ నగారా బజాయించె ప్రేమం.
హృదయం లభ్యమైనవారలకే లభించెను దేహం సైతం.

"పార్థుని శర గురి కెరయై భీష్ముడు కా దొరిగినది;
ఆతని వృద్ధాప్యం మాత్రమె. వృద్ధాప్యపు చీకట్లను చీల్చుక
ఉదయించెను నా యువకత్వం.

"సమర్పించి ప్రేమానికి హృదయం,
ధర్మానికి భుజముల- ఆనంద నిషాపుర్ణంబగు
మానసంతో అడుగిడితిని కురుక్షేత్ర రణరంగంలో.

"ఈ న్యాయోచిత విభజనతో
ఎంచితి దుర్విధిఅంతం జరిగిందని. తెలియలేదు
కర్మబంధముల కన్నను మిన్నయైన దీ ప్రేమబంధ మని.
"ధర్మభీతిలో జడిపించుచు పరిచారకునిగ జేసెను కర్మ నన్ను.
సర్వస్వం బలిదాన మొనర్పగ అనురాగం బొసగ సాగె నీరవ సంకేతం.

"ధర్మజా! సంకట సమయంలో పటాపంచలగు కృత్రిమ ఆచ్ఛాదం
నిగ్గుదేలి ప్రకటితమగు మనుజుని నిజరూపం.

"ఘోర సమర విజృంభణ సాగిన కొలదీ
స్పష్టంగా ద్రష్టం బవసాగెను అస్పష్ట కథాక్రమం.
అణగారిన నాదు యౌవనం తలయెత్తెను మరలా
స్నేహప్రణతు లర్పించగ.

"నశియించెను బుద్ధిభ్రాంతి. దృష్టికి దూరంబయ్యెను,
కర్మ సంబంధిత మిథ్యాజాలం.
ఉద్విగ్న ప్రేమయె ఎలుంగెత్తి పిలిచెను నా మనో దేహాలను.

"-పార్థా! స్వీకరించు! యిదిగో నా సర్వస్వం!

వధించి కూల్చుము నను. అబ్బా! దుస్సహ మీ విరహం
చేర్చుము నను ప్రేమాస్థానం.
"బ్రహ్మచర్యదీక్షా దివసంబున రుద్ధమైన ధారయె
ప్రేమ ప్రవాహమై పారెను కురు భూమిలో.

"వీచలేదు మలయమారుతం చలించలేదు మనోకుంజ మెపుడూ.
దాగొని ఆకుల చాటున కూయలేదు కోయిల లేవేళా.
"ఎవరికైన ఎప్పుడైన సమర్పించి కుసుమాలను
సన్మానిం చెరుగను. ఉదాహరణకైనా
వినియోగం కాలే దీ దేహం దానార్థం.

"హృదిలో ఏదో కోణంలో దాగిన ఈ అసంతుష్టి
కన్నుగప్పి ఆసీనంబయ్యెను గుట్టుగ జీవన పర్ణ పాత్రలో.
"ఆ భావమె అనిలో వికసితమై అధిష్టించె మహాదర్శవేదికపై.
వ్రణ వ్రణమున ఆ భావమె పలుకుతోంది తియ్యని బాధై.

"సదా సచేతనుడనై సుకుమారతపై
సంధించి శరాసనం ఎక్కుపెట్టి గురిగా బాణం
బంధించితి ప్రాణాలను నియంత్రణాబంధాలతో.

"గ్రహించ నశక్తుడ నైతిని అంతరాన ఏ మాయో
సంచారం చేస్తోందని. అగాధ భావాంతర
అభేద్యమౌ లోతులలో జ్వలిస్తోంది జ్వా లతిగుప్తంగా.

"వీర సుయోధన సేనాపతినై పోరాడగ వెడలితి!
కురుభూమికి రాలే దాహు తవగ ప్రేమానికి.

"నిజం! పార్థుని గాండీవంపై అగాధ మపారం నా
భక్తి శ్రద్ధలు. నిజమే! దానిని వీక్షించిన చాలును
ఆనంద తరంగా లుప్పొంగును మానసాన.

"నిజ మిది! నిర్మల హృదితో వాంఛించితి పాండవ శ్రేయం.
కా నేం చేయను! అమ్ముడయ్యె నా దేహం దుర్యోధననునకు.

"బ్రద్దలొనర్చి ధర్మవ్యూహం ఎగనెత్తుకుపోయెను అనురాగం

నిజ సంపత్తిని. మన సెవరికి లభించెనో
వారలదే తనువుసైత మని రుజువయ్యెను.

"మధుర ప్రేమ అమరత్వం బిదివరకే నా మదిలో
ప్రకటితమై యుండుంటే ఎంత హాయిగా నుండెడిదో!
బహుశా కురుక్షేత్ర దుర్దినాలు తిలకించెడి గతి

కలిగెడిదే కా దీ గడ్డకు. "ధర్మజా! ఉపేక్షించి కోమల భావాలను,
అనిపిస్తున్నది నేనూ తోడైతిని ఈ జగత్తు నని కీడ్పుటలో నని.

"జీవన అరుణోదయ వేళన చేసితి కఠినవ్రత ధారణ.
ఎప్పటి కప్పుడు గడిపితి స్నిగ్ధ భావముల దగ్ధం చేస్తూ.

"విశ్వాసం లేదు నాకు కర్మకంటె మిక్కిలి యైనది,
సుందరాతి సుందరమైనది ప్రేమం బని. లేదు నాకు

వ్రతదీక్షా కాంతుల కన్నను మిన్నయైన
దీ కోమలతా కాంతిచ్ఛట యను నమ్మిక.

"-కరాన చాపం, మూపున నిషంగం;
మానసాన నీతీ, విజ్ఞానం- యివి మినహా
వేరు విషయ మేదీ ఎరుగను మరి జీవితాన.

"ఎపుడైనా ఏ సందర్భానైనా,
నవ్యభావ మేదైనా అంతరాన జనియించిందా!-
వినయం, విజ్ఞానం, నీతులు
చుట్టుముట్టి దాని చుట్టు దాసోహం బనిపించెను.

"దుర్యోధన దుశ్చేష్టలతో నిత్యం నా హృది క్షోభించెడిది.
కా నేంచేయను మరి? నీతీ, ధర్మాలిట సబలం; ప్రబలతరం.

"అను శాసన స్వత్వం చేజేతుల నీతి చేత నిడి,
పరాధీన దాసుడనై, ఆసీనుడ నైతిని స్వగేహమందే.

"బ్రతుకుపైని అధికారం బద్ధిది, అనుచరి మాత్రమే హృది
ప్రకటంగా నను హెచ్చరింప బిడియం చెందెడి దది.
"ఏనాడూ అనజాలకపోయెను- "గాంగేయా! ఏ దిక్కుకు

నీ పయనం? న్యాయ దండధారి వయ్యు సైరిస్తున్నా వన్యాయం".

"మానసాన పాండవానురాగం శరీరం కౌరవ సేనలో
ఈ చెదరిన ధ్యానంతో ఏ పని నెరవేరును?"

"పాండునందనుల యెడ ప్రజ్వలితంబగు
దుర్యోధన భీషణవైరం ప్రతిబింబించెను నాలో
తనువుతోడ మనసు పడెడి ఘర్షణగా...

"జయించి నా కరముల సత్వం హృదయ వేదిపై
నుంచుద మని భావిస్తే- బలిచేసెను
బద్ధి నన్ను భ్రాంతికి; కదలనీయలేదేం మాత్రం నను.

"దానంత టదే అంతమొందు వైరంబని
ప్రదర్శించె కల లెన్నో. నీతులు వల్లించసాగె
ఈ లోకంలో తన వారెవ్వరు పెరవా రెవరని.

"అన్న దొకప్పుడు నీవే త్వరితపడితివా
అంతరించు అగణిత జన సహనం
ఘటించు ఘోర కల్లోలం విచ్ఛిన్నం బగు వ్యవస్థ.

"ఒక పరి రెచ్చగొట్టి వీరత్వం
అడ్డుపడెను వన యాత్రకు వాంఛిత ఫలితం పొందకుండ
వంచించెను మేధ నన్ను పలు తెరగుల.

"నే డాలోచిస్తున్నా. దా నుపదేశం పెడచెవి నిడి యుంటే
స్నేహపూర్ణ సుస్వచ్ఛ న్యాయం గుర్తించెడి శక్తుండుంటే,

"రాజనీతి కలుషం రాగజలంతో కడిగి కడిగి పోద్రోలుంటే
వినిర్మల కరుణతో దండనీతి మేళవమై యుంటే,

"సాధికార హృదయంపై వాణి రచించజాలని గాథను
ప్రఖర లేఖినీధారుడనై లిఖించ నద్యుక్తుడ నైయుంటే,

"బుద్ధి ఏలుబడి నుండీ హృది విము క్తమై యుంటే,
త్యజించి మంత్రీపీఠం పీడితులకు చేయూతై తే,

"రాజద్రోహ ధ్వజధరుండనై వీరవిహారం జరిపుంటే,
న్యాయ పక్షపాతినిగా సుయోధనుని గద్దించుంటే,

"బహుశా భీతిలి సుయోధనుడు
మరింత జాగ్రతగా వెనుక ముందు యోచించు మరి
వేసెడివా డడుగులు.
బహుశా భవిష్యత్తులో మరో సంగ్రామానికి
బ లయ్యెడిది కాదేమో భరతభూమి.

"కా నేం లాభం! జరిగిపోయె సర్వం;
శేషం బిసుమంతయు శూన్యం
యిక పోనీ యీ గాథను. గతం మరిచిపో!
అవతరించనీ లోకంలో నవ్య యుగం!

"అవసానానికి ముందే ప్రాప్తించెను శాంతి నాకు.
ఫలము లన్ని లభియించెను. ధర్మం, స్నేహం రెండూ
సులభసాధ్యమై నా కోసం ప్రాప్తించెను దారిబత్తెమై".

# పంచమ సర్గ

వాణీ! వ్యాకుల సంక్రాంతికాల నరుడను.
కలికాలపు ఫాల మధిష్టించిన ద్వాపరాన్ని.
పరితపించు లోకానికి నీడను శోధిస్తూ,
ఎంతో ఆశతో చేరుకొంటి యితహాసపు లోకం.

కా నిట సైతం మండుతోంది ఆకాశం.
దాహకకల్లోల తరంగా లిట సైతం లేస్తున్నవి వాయువులో.
కాల గహ్వరం వెలువరచెడి కోలాహల మదిగో!
విక్షుబ్ధ భయానక సంద్రపు బడబానల ఘో షల్లదిగో!

బ్రహ్మాండంగా మండెడి వనర తరు సంఘర్షణారవం!
ఉజ్వల, భయానక అగ్నిశైల విస్ఫోటం!
ఈ చరిత్ర పుటులు వెలువరించు దుర్గంధం బేమి టది?
ఏమిటా మండుతోంది? ఎచ్చటి దీ వికృత ధూమం?

భీతిల్లిన వసుంధరా వక్షంలో గ్రుచ్చుకొంది శూలం.
ఎవ్వరి దీ రెప రెపలాడెడి అరుణారుణ జయపతాక?
నెత్తుట తడిసిన దేహంతో ఎర్రని తన నాల్క జాచి
ధరించి విధ్వంస కృపాణం వికట నృత్య మొనరించెడి దెవ రది?

ఆ పరుగిడసాగిం దశ్వరాజమా? మానన దుర్మదమా?
ఆ జరిగెడి దది యజ్ఞ కాండయా? అకారణ జగ విధ్వంస కాండయా?
ఆ మృణ్మయకలశ పాత్రలో ఖడ్గం సంచిత మొనరిస్తున్నది
గంగోదకమా? మనుజ రుధిరమా?

మరో దారి గనజాలక నరాధిపమండలి మోసెడి
భారా లేమిటవి! యజ్ఞోపహారములా? స్వాభిమాన ముత్యములా?
యజ్ఞ హోమగుండంబుల మండెడి దది ఘృతపూర్ణ హవ్యమా?
అపహృత నృపాహంకారమా?

అది ఋత్విక వేదఘోషయా? దాహక మంత్ర ఘోషయా?
అది ప్రశాంతి సాధించేనా? జీవనాగ్ని మరింతగా
ప్రజ్వలిత మొనర్చునా? ఆ ధూమ్రవర్ణ ధూమం
విజేత యశశ్చంద్రికల కుదాహరణమా?
వినశ నరేశుల క్రోధం జోరుగ రాజుతున్నదా?

అది స్వస్తిపఠనమా? నూతన అనల ప్రకోపమా?
యజ్ఞాంత స్నానమా? రుధిరాభిషేకమా?
చక్రవర్తి ఫాలంపై హత్తిన ఎర్రని తిలకం బది
చందనమా? ఒకానొక పురుషుని ప్రజ్వలిత ప్రతీకారమా?

కృపాణ పథానుగామియై నడువసాగె కవి లేఖిని సైతం.
లిఖించసాగె కర్కశ, కఠోర ఉన్మాదానల ప్రశస్తి
ద్వేషాన్విత రణం నుండి జయఘోషలు చేస్తూ
మరలెను లేఖని. వాణీ! వెడలెను నీ సదనం నుండొక సఖి.

కరాన నీరాజన పల్లిక గొని మనోహర స్వరమున
స్వాగతపద సంకీర్తన సల్పుచు బిరబిర పరుగిడి వచ్చెను.
హారతి వెలిగించి మారణ దేవతపై పూరేకులు జల్లగ
సాగించెను నృత్యం, గానం...

చీరాంచలాన తుడిచి శరీరం నెత్తురు మరకలను కడిగి
అపురూప రూపంతో పలు తెరగుల రూపం తీర్చిదిద్ది, ప్రాణాల్లో
ఏదో విధి శోభా, ప్రభలను నింపి శౌర్యం, ప్రరాక్రమంబను
బిరుదులిచ్చి అమర మొనర్చెను రణదేవిని తన ప్రశస్తిగేయ గానంతో

విద్వేషరణ పరాజితుడయ్యెను బూడిదగా.
విజేత వెలుగొందెను పూజనీయ అనలకణంగా.
నిజం! విజయంతో స్వరూప పరివర్తన జరిగెడి వీలే యుంటే;
హత్యాపాతక భారం శిరం దిగెడి తేరవేయుంటే;

ఎవ్వడు చింతించును విజయానికి?
వీనులు, కన్నులు మూసుక శోధించు న దెవ్వడు అంతరాత్మ?
'ఒక్క నరుని హత్యయితే పాతకమా?
మరి పావన మెట్లాయెను సామూహిక వధ?'

అని ఎవ డాలోచించును?

'సమరశూన్యం తరుణంలో వా డెవరికి భీతిల్లును?
కంటబడిన ప్రతి నరునీ నిర్భయుడై వధించాడేం?
రణరంగంలో జొరబడి హద్దు మరచి విహరిస్తాడేం?
విచ్చలవిడి నర కుత్తుక లుత్తరించు అధికారం
ఎవరిచ్చా రతనికి?' అని ఎవ డాలోచించును?
కానీ కరాళ కాలగర్భంలో కళ్ళ నీళ్ళు నింపుక,
రక్తసిక్త దర్పం కాలదన్ని. మానసాన కరుణాన్విత స్నేహజ్యోతి రగిల్చి,
నిలచియుండె నొకానొక బుద్ధిశాలి.

ఎట్టఎదుట ప్రతీక్షమగ్నంబగు విజయలక్ష్మి
నిలిచెను ఒదిగి ఒదిగి వరమాలాధరియై.
కాని యుధిష్ఠరున కిదంతా అయోమయం.
గుర్తించ నశక్తుడయ్యెను సౌందర్యపు ముద్దను.

పేరుకు నిలిచి యుండె కౌంతేయుడు ధరాతలంపై.
ఆయన మానస మైతే విహరిస్తున్నది మరో
అపురూప లోకంలో. విద్వేషం ద్రవించి నీరగు నచ్చట.
కర్కశ, కఠోర అస్త్రాలన్నియు నీరగు నా లోకంలో.

రాగ రహిత నరు డచ్చట విహరించును.
సరస్పరం నరు లొకరి కొకరు భీతిల్లరు.
విశ్వాస ప్రశాంతులు నిర్భీతిగ రాజ్యమేలు లోకం బది.
కలుషిత స్వార్థ భావనలు వర్జిత మా లోకంలో.

ప్రతి నరహృదయంపై శాసనాధికారం కరుణది.
అట పాలించెడి దది ప్రేమాంకుశం; న్యాయపూర్ణ క్రమశిక్షణ.
పర రుధిరంకంటెను స్వీయాశ్రు పానమే శ్రేష్ఠ మచట.
త్యజించి సామ్రాజ్యం బిచ్చమెత్తి బ్రతుకుటె ఘన మా లోకంలో.

రక్తదాహ మిసుమంతయు శూన్యం.
నర శిరస్సుపై సమరశాప భారం లేదట.
శీతల సమతా వృక్షచ్ఛాయల పోషితమగు జీవితాలు.
యింటింటా వెలుగొందును పీయూష జ్యోతులు.

ఓసీ! జయలక్ష్మీ! రక్తసిక్తమే నీ వసనం.
కాలుని దంష్ట్రలకూ నీ పలువరుసలకూ ఏ ముందే భేదం!
జ్వాలల జాలరు తొంగి తొంగి చూస్తున్నది నీ పమిట కొంగులో.
నిండి యున్న దే నీ నల్లని కేశాల్లో విధ్వంసపు ధూమం!

సర్వం గ్రసియించిన ఓ కురుక్షేత్ర విష భుజంగమా!
తుడిచెయ్ నీ వదనపు నెత్తుటి మరకలు.
ఎవ్వరి వరణార్థం నీ వింతగ వ్యాకుల పడుచుంటివో
అతడు శోధిస్తున్నా డింకేదో పీయూషఫలం.

అదుగో! అటు వీక్షించావా? అనంత గగనంలో
ఏదో తరంగవాహనుడై పోతున్నా డతి దూరం.
సమతులముగ ప్రవహించెడి పరిశుద్ధ ప్రేమసలిల పూర్ణంబగు
అమృత మందాకినీ ధారను ధరణికి మళ్ళించగ
పయనిస్తున్నా డతి దూరం.

ఈ కలలే సత్యాలై జాగృతమగు సత్యశాంతి యిలలో.
యిదే విధి ఏదో ఒక దినమున
సాధించు నీ జగత్తు మృత్యువు పై విజయం.
కన్నులందు కరుణా మేఘంబులు కరిగి, ద్రవించి,
ఉప్పొంగిన మరుక్షణమే విజేత హృదిలో ప్రజ్వలించు పశ్చాత్తాపం.

ఏ దినాన హత్యను హత్యనుకొని
విజయుడు విలపించునో, ఏ రోజున దేహపు రుధిర కళంకం
కన్నీళ్ళతో కడుగునో, ముక్తంబగు నా దినానె
మానవ విజయపథం. భీతిల్లిన ధరణీభాగ్యోదయ
అరుణోదయ మానాడే.

ఓసీ! విధ్వంస పుత్రికా! కై పెక్కిన జయలక్ష్మీ!
కరమున వరమాలను గొని నీ నిలబడు టెవ్వరి సన్నిధినే?
కా డీతడు; లేడిచ్చట కత్తిబట్టి దండెత్తెడి పురుషుడు.
ఏదో సామ్రాజ్య సర్వస్వం ఎల్లరకూ కొల్లలుగా
కొల్ల బెట్టువా డీతడు. పొందలేవు నీ వాతని
రక్తసిక్త దేహంతో. ఆ యోగిపుంగవుని ముంగిట

పని చేయవు నీ మదశరాలు. యిపుడపుడే ఈతనితో
కాజాలదు నీ పాణిగ్రహణం. ఇది పవిత్ర తపోభూమి.
నీ గేహం బెటనో గడిచిపోయె వెనుకే.

ఆ గగన విహారి తిరిగీ లోకానికి
మరలెడి వేళకు విసర్జించి వైరాగ్య ప్రపంచం
ఏ తెంచును యతీశ్వరుడు. ఆ వేళకు వర్థిల్లదు నీ
నవయౌవ్వన లావణ్యం. ఆ గడియకు వాడగలవు
నీ వరమాలా పూరేకులు.

విలపించెడి హృదయానికి బుద్ధెంతగ బోధిస్తేనేం?
విడువదు ప్రకృతి తన ప్రతీకార భావం.

యుక్తికి పరాజితమై కావచ్చును హృది ప్రత్యుత్తరహీనం.
ఐతే ఎంతమాత్ర మంతం కాదీ కర్కశ వేదనాక్రమం.

ఎట్ట ఎదుటి పరుచుకుపోయిన ఈ నిర్మానుష, విధ్వంస,
విషాద దృశ్యం దృష్టికి దూరంగా, ఏ విధి, ఎంతవరకు,
గుప్తపరుచు శక్తున్నది యుక్తికి?

నిరంతరం కథాక్రమ కథనం భీష్మ ముఖంగా సీమారహితంగా
ప్రవహిస్తూనే ఉన్నది. వింటూ వింటూనే

భోరున రోదించెను కౌంతేయుడు.
"తాతా! గతించె సర్వం. యిం కే మున్నది శేషం?
శేషించిన దల్లా అదిగో? సమ్ముఖాన దృశ్యంబగు మృత్యభూమి.

"భీకర భీమకాయ ప్రేతంవలె అలసి సొలసి
ప్రశాంత గంభీరంగా భయానక మృత్యువె
పవళించెను స్వయముగ.

"రక్తసిక్త చీరాంచలాన ఖండిత నరశరీర తుండెంబుల
-తన మృతపుత్రుల- నుంచుక విషణ్ణ వదనంతో
మౌన గంభీరమూర్తియై పడియున్నది వసుంధర.

"క్రుళ్ళెడి విషగంధానికి ప్రాణం ఉక్కిరిబిక్కి రగుట గని

ముక్కు మూసుకుని గ్రక్కున, వడివడిగా
పరుగెత్తగ సాగెను పవనం.

"శీతకాల దినకరుడదె దుఃఖితుడై
శంకించుచు, శంకించుచు, ఉండి ఉండి ప్రసరిస్తున్నా డెండను.
మబ్బుల చాటున మరుగుపరచి తన వదనం,
పయనం బవసాగెను మౌనంగా శశిబింబం.

"వాయుసాలు, గ్రద్దలు జంబుకాలు, శ్వానంబులు
వందలాది జంగురు బిల్లులు కాలుని అతిథి సమూహమో యన
మందలు మందలుగా విహరించగసాగెను హాయిగ,
విలోకించి విపులాహారం.

"మనుసూనుడు మృగాహారమా? కాదా యిది నరాంతకం!
భారత వీరవరుల కింతటి దుర్గతియా?
అయ్యో ఏం కానున్నది భవిష్యత్తు!

"ఒకప్పుడు ప్రేయసి కంఠహారమై విలసిల్లిన బాహుల, మరొక తరి
అరిమూకలపై కాలుని వలె ఉరికిన కరముల,
శరీరమున కిరువైపుల గజతుండములా
యనిపించెడి సుదీర్ఘ బాహుల,
పక్షీంద్రుని బలిష్ఠవక్షాలను మరపించెడి భుజముల
నీ దినాన స్వేచ్ఛగ, నిర్భీతిగ పీక్కొని తింటున్నవి నక్కలు, కుక్కలు.

"వాయసాలు తమ ముక్కులతో పొడిచి, పొడిచి ఈ దినమున
ఛిన్నాభిన్న మొనర్చెడి ఆ ఫాలం- విలసిల్లెను ఒక రోజున బహుశా
ప్రపంచ ప్రగతీకోశంగా; మధుర కల్పనాగారంగా.

"ఎవని వక్షమో మరి తమ ముక్కుల నాటుచు,
చీల్చి, చీల్చి తింటున్నవి రాబందులు.
బహుశా-కావచ్చు నదొక సుకవి స్నేహపూర్ణ, సుందర వక్షం.

"ఈ విధ్వంస ప్రసాదం జనహననం బొకటేనా!
ఎంతటి అమూల్య అలభ్య సౌభాగ్యం కొల్లగొట్టుకొనిపోయెను.

"భయ మెరుగని నర శ్రేష్టులు సముజ్వల శూరధనులు
కళలకు, ధర్మానికి జ్ఞానానికి, విజ్ఞానానికి
ఆధారమూర్తు లెందరో,

"కానుకలై ఆహుతైరి సమరానికి.
అమూల్య రత్నాలను కోల్పోయిన పుడమితల్లి
సంపన్నహీనగా, దీనవదనయై, బయల్పడెను కురుభూమినుండి.

"విభవం, తేజం, సౌందర్యం సర్వం పయనించెను దుర్యోధనుతోడనె.
ఈ పాపికి దక్కిందొక ఎండిన మొండెం మాత్రం.
"మృతుల స్మృతులను ఆఘాతాభిశాప మీ శుష్క కంకాళం!
శోషిత జీవిత జనముల మనోవేద నీ అస్థిపంజరం.

"యుధిష్ఠర విజయచిహ్న మొక ఎముకల గూడు!
అమూల్య మహాభారత బహుమానం బొక
బొమికల బోను. "గాయపడ్డ మనుజుల
మూల్గులతో నిండిన ధరాతలం;
కరుణాక్రందనా భరితం బగు గగనం;

"సాధించిన సిద్ధులన్ని బూడిదగా శేషించిన,
సమృద్ధి కుసుమా లన్నీ మండి మండి మసైన ఈ విశాల దేశం;

"ఈ ప్రళయోచ్ఛిష్ఠం దారుణ విషోరగం
కాటేసిన ఈ విశాల ఖండం! యిదే! యిదే! మిగిలిన దిదియే!
నా శ్రేయోసదనంలో శేషించిన వరదానమిదే!

"సమసిరి సమస్త వీరులు సుయోధనుతోనే.
శేషించెను మృత ప్రేతభరితమే దేశం.
శేషించెను పుత్రుల కోల్పోయిన మాతృ క్రందనం.
శేషించెను వికృత వితంతు యువతీవేషం.
నశియించెను సుఖశాంతులు.
అంతరించె రసరాగం. మిగిలి దంతులేని సంతానం;
కరుణా దీనత్వం. విజేత అదృష్టానికి
మిక్కిలిగా దక్కిందిక సమృద్ధి క్షారం మాత్రమె.

"శాంతించెను సమరం. ఐనా మరి ఈనాడూ
భయగ్రస్తమై యున్నది ధరాతలం.
దిగులు దిగులుగా నున్నది పుడమితల్లి.
ఆడా, మగ అందరి వదనంపై నీడవోలె వ్యాపితమై యున్నది
మహా వినాశం. అవని అంబరాలు రెండిట
అలముకొన్న దశేష గంభీరత. అవగాహన కాలే దీ ధరిత్రి
బ్రతికుందో, చచ్చి పడుందో.

"తాతా! కను మా ఘోర శ్మశానం.
తిలకించా ఏతెంచెడి సమృద్ధ ప్రేత సమూహం.
చుట్టుముట్టి కురురాజును, సమర్పించి జయహారం,
పాడసాగె నవిగో అవి ప్రశస్తి గీతావళి.
ఖండిత పీనుగ తుండెంబులు కనుగొను మివిగో నని
సైగలు చేస్తున్నవి నను. ఆ కొంటెనవ్వు విన్నావా తాతా!
పకపకలతో, వికవికలతో పగలబడుతు రగిలిస్తున్నవి
నను కన్నావా తాతా!

విను మా ప్రేతకృత విసురులు- "ధర్మజా!
సాధుత్వపు బోధలు బల్ జోరుగ చేసెడివాడవు.
తపస్సు, త్యాగం, కరుణా, క్షమలని
జపియిస్తూ ఎల్ల జనులకూ ఉపదేశించెడివాడవు ప్రతినిత్యం.
పరదుఃఖంలో పాలుపంచుకొన పరుగెత్తెడివాడవు వడివడిగా.
కోలుపోయి ధన సదనాదులు ధర్మంకోసం చేసెడివాడవు వనవాసం.

"ఇది వాస్తవమా? అశక్తజన కపటయుక్త విరాగమా?
జన మనముల జాలి రేపి తన నడపడి మరుగున
జరిపిన నిజ దళ సమీకరణమా?
నీలో నుండిన దది సహనశీలతా?
గుప్తంగా ప్రజ్వలితం బగు ప్రతీకార దివిటీయా?
అది ధర్మపరాయణతా? పిరికిని మరుగుపరుచ జరిపిన కపట నాటికా?

"జన మన వశీకరణ జరిగిన మరుక్షణమే
నరపతులును వశీభూతు లవసాగిరి. హరించిపోసాగెను
నీలో కరుణాభావం. సతాయించ సాగెను నిను ప్రతీకారభావం.
విసర్జించి తప త్యాగాలను ప్రదర్శించ సాగిరి పాండుసుతులు

తమ నిజస్వరూపం. వినాశం వినువీథుల విహరించగ సాగెను.
యుద్ధ మేఘావృత గగనం గర్జించగ సాగెను.

"నిజ దుఃఖం, కురుభూపతి సౌఖ్యం నిత్యం నిను కలచెడిదా? లేదా?
నిజం చెప్పు! కురురాజ ప్రతాప ప్రభావం గని నీ ప్రాణాలుడికెడివా?
లేదా? సాధు వేషధరులౌ పాండుసుతులు
తపస్సు మాటున గుప్తపరిచి తమ దురగ్ని
వంచించెడి వా రీ ప్రపంచాన్ని. మానసాన మండెడిది ప్రపంచ ప్రతీకారజ్వాల
ప్రకటంగా మాత్రం ప్రదర్శించువా రతి వినయం.

"ఇక నీ దురగ్ని యుద్ధంలో బ్రద్దలు కాగానే
నీ వొనరించని పాపకృత్య మేమున్నది?
గురుని వధించుటకై అనృతాని కొడిగట్టావ్.
సమాధి దశలోనే వధించి హరించితివి గురుని శిరం.
కపటంతో కురుభూపతి తొడలు విరిచి
నెలకొల్పావ్ నవీన రణధర్మం. ఒరీ! పాపీ!
సంతోష స్వాంతుడవై బ్రద్దలొనర్చి
మరణాసన్న మనుష్య వక్షం, నెత్తురు గ్రోలితివి నీవు.

" ఏ విజయలక్ష్మి వరణార్థం క్రూరకర్మ కొడిగట్టితౌ,
నే డద్దానిని ఒడి నిడుకొన జంకెదవేం?
కాల దన్నుతావేం జయలక్ష్మిని? పాంచాలీ భయమిపుడేమైనది?
కురుభూపతి భోగించిన ఈ సిద్ధిని – ఈ రాజ్యశ్రీని
హర్షంతో కౌగలించ వెనుకాడెదవేం?
ఓ కురుక్షేత్ర విజేతా! తెలియ జెప్పు!
కురు గద్దియపై అడుగిడ తడుబడు తావేం!

"ఇపు డద్దేముం దిక పాండుసుతులు ధరించగల రిక
రాజకిరీటం హాయిగ. కురురాజుకు హడలెడి పని లే దిక
హాయిగ శిర మెత్తుక తిరుగవచ్చు నిక భువిలో.
ఇక కోరినంత సౌఖ్యం పాండవులకు! ధనధాన్య సమృద్ధ మగు నిక ధామం!
ఏరీ పాండుసుతుల కాదని విరోధించగల వీరులు?
మహదానందంగా ఏలవచ్చు పాండవు లిక విధవల సామ్రాజ్యం!"

"నిజమే కద తాతా! వీరపత్ని వసుంధ రదిగో
వితంతువై రోదిస్తున్నది. ముంజేతుల గాజుల
ముక్కలుముక్క లొనర్చి నొసటి పసుపు కుంకుమలు తుడిచేస్తున్నది.
వీక్షించుము విజయనిహిత అవినీతిని! ధరిస్తోంది మదమత్త
పిశాచి రూపం! కాకుంటే ఈ చితుల సమీప సమక్షంలో
ఏమిటీ విలాపినీ వివాహ సన్నాహం?

"దరికి జేరి చీ దుఃఖిత విధవను ఏ తీరుగ హత్తుకుందు వక్షానికి?
ఆమె పతీ చితాగ్నులైనా చల్లారగ లే దింకా.
నా పర్యంకముపై నేనే విధి జేర్చుకొందు?
సంపదానురక్తుడనై శేషిత ప్రతిష్ఠ సైతం మృత్తిక పాలొనరించను.
గతించినది గతించింది. ఈ యుద్ధ మచ్చ నికమాత్రం వృదతనీయను.

"–సంగరాంత ఫలమిల సౌభాగ్యం!"–
తాతా! ఈ సత్యం క్రితమే గుర్తించుటే–
నాలో దాగిన ఈ లాలస వనవాసంలోనే పసిగట్టుంటే!–
–లెక్కేమిటి ద్రుపదపుత్రి!– శ్రీకృష్ణుని బోధలు సైతం
లెక్కించుదునా తాతా! ఏ దేమైనా–తిరిగి తిరిగి చెబుతున్నా–
సిద్ధపడుదునా యుద్ధానికి!

"కా నేం చేయను? మోహాంధకార నడిరేయది.
నేటివలే జ్ఞానోదయ మవలేదప్పుడు.
ప్రఫుల్లితం కాలేదప్పుడు. పరిశుద్ధ జ్ఞాన ప్రసూనం.
క్రమ్మెను తిమిర భరిత భ్రాంతిజన్య పొగమం చతి దట్టంగా
కాదది కేవల క్రోధాఘాతం. ధనలోభం నను తొలువసాగె నదేపనిగ.
సర్వం తలదన్నెడి సత్యం –ఏం చేయను తాతా!–
తగు సమయంలో రాలే దది తలపుకు.

"సమరోత్సాహంతో సైన్యం కదం త్రొక్కి కదలునపుడు
నా పయనం బేదిశకను ఆలోచన లేవలేదు నాలో.
ఏ అమూల్య తథ్యమూల్యం చెల్లించగ నా ఈ దేశ నాశనాహ్వానం?
నను యుద్ధానికి ప్రేరేపించెడి వని కురుభూపతి కోశములా?
పాంచాలీ కేశములా? నా ఈ పయనం అవమాన హననానికా?
సుఖభోగ పిపాసాహరణానికా?

"అవమానానికి ప్రతీకారమా?... కల్లబొల్లి నటనాకౌశల మిది
నిజానికి మా మనోవాంఛ సుఖభోగం.
మరలా నిర్మించొక మనోహర మహాసభా భవనం
కురుభూపతి హృది రగిలించుటె మా కిష్టం.
నిజ దురాశ నిత్యం అభిమాన జ్యోతికాంతిలో
గుప్తపరుచ యత్నించును మనుజుడు.
పడుచుండును ఘర్షణ లోభంతో. పగ చెల్లించుటకే నని. నాటక మాడును.

"పరిపూర్ణం బయ్యెను మా ప్రతీకార ధ్యేయం.
ఇక కావలసిన దేమున్నది? శేషించిన కురు రథీత్రయంపై
రోషం మా కిసుమంతయు శూన్యం. నేను సైత మొప్పుకొనెద
శత్రుప్రేరితమై పోరుటలో మా దోషం లేదని.
కానీ కురు వైభవకోశంమము ముంచి వేయదా నరకంలో?

"అనరా మరి సర్వజనులు డంబానికి సాధువయ్యె ధర్మజు డని?
తపో త్యాగ క్లేశం క్లిష్టమైన మరుక్షణమే దుష్కర్మల
కొడిగట్టితి ననరా? తుచ్ఛ సుఖాసక్తుండై
నరహత్యకు దొరకొని ధర్మజు డతి క్రూరుడయ్యె ననరా?
కరుణా వ్రత కంకణుడై బ్రతుకు గడుప నశక్తుడై
రౌరవనరకానికి పాత్రుడయ్యె ననరా?

"ఒకరిద్దరి అవమానంతో తూచము, సరిపోల్చము
విశ్వ విధ్వంస యుద్ధం. ఈ రెండిట ఎయ్యది
విఘాతక మహాపాతకం? విప్పుము దీని రహస్యం వితర్కించి.
ఈ నా దీన, విషణ్ణ వదనం గని జాలి బూని దేవా!
మరుగునపరచ బూనను సత్యం.
ఈ నరమారణ కారణ మెవ్వరు?సుయోధనుడా?
ధర్మజుడా? వెల్లడించు తాతా!

"దుర్యోధను మొండితనం గని నేను సైత
మాదర్శచ్యుతుడను కావాలా?
ఆతడు దూకిన విషపు రొచ్చులోనే సైతం పొర్లాడాలా?
కత్తిబట్టి నిలిచె నతడు. మరి నే సైతం అసిధరుడను కాక తప్పదా?
పాంచాలీ పరాభవ పగ చెల్లించగ దేశ ధ్వంసానికి పాలుపడాలా?

"ఎవడో అవమానించె నెవడినో.
సమస్త మహీతలంబిక అస్తమించవలసిందే?
ఎవడో ఎవడిమీదనో విసర సాగె దాహక బాణం.
ఇక ఈ లోకం సైతం కాలి కాలి కావాలా ధూళి?
రగుల సాగె దురహంకారం బెవ్వడిదో.
ఇక సర్వులు కావాలా దుర్మదలోలురు?
ధణ ధణ మ్రోగెను ఎవ్వడిదో రణభేరీ.
మరి యిక నరులందరు బలిబలియని
బలి పశువుల వలె ఎగబడి పరుగెత్తాలా?

"పిలువకు దీనిని బల విక్రమతేజం బని.
ఇది సమరజ్వరం-ధ్వంసకరం. దానవతా జటాజూట మిది.
మానవతా అంతర్గత భీకరాతి భీకర ద్వేషానలజ్వాలిది.
ఇది మేధోన్మాదం. భ్రాంతికి బలియైన నరుడుకనజాలడు ఘన సత్యం.
కురువంశంలో అగ్గి భగ్గుమన్న దనగానే తలపోయును
తన కొంపకె తగిలెను అనలంబని.

"దురహంకారులిద్దరు కొట్టుకుచస్తుంటే వారిని విసర్జించదేం లోకం?
పరస్పరం నాశన మవదలచిన వారిని నశించనీరాదూ లోకం?
ముందు వెనుక లాలోచించకనే ధారపోయు నిజ.రుధిరం,
దాన వీర నరమాత్రుడు. కా నెందుకనో తెలియదు మరి తటస్థుడై
సమరాగ్నులపై విరజిమ్మలేడు సలిలం.

"ముగిసెను కురుక్షేత్ర సంగ్రామం. శేషించిరి మాలో కేవల మేద్గురు.
దక్కిరి కురుపక్షంలో ముగ్గురు మాత్రం. ఎల్ల జనులు గతించారు.
కుంటివారు కొందరు, గాయపడ్డవా రింకొందరు, వికలాంగులు,
వివర్ణులు, నికృష్టులు మాత్రం మిగిలా రీ భువిపై.
ఎవరికైన ఏమున్నది బావుకొనగ? సర్వజనులు కొంతకు కొంత
ఎంతో ఒకంత కోల్పోయినవారే. దీనులుగా బయట పడ్డవారే.
గ్రసించి కురువంశపు రాజగద్దె హసించెడివా రిక పాండవు లొకరే.

"ఇప్పుడయ్యె నా కవగతం. యుద్ధానికి మూలం బీ రాజగద్దెయే.
పాంచాలీ కేశాల్లో దాగిన లోభభుజంగం, నే డగుపిస్తున్నది స్పష్టంగా.
నిజం! మనోనేత్ర మంగళకర జ్ఞానజ్యోతిని గ్రసించిన దీ లోభోరగమే.

ఇదే సజీవమై యుంటే నే నెక్కడి విజేతను?
ఇదిగో ద్వితీయ రణ మీ క్షణమే ప్రకటిస్తున్నా.

"ఈ మహారణం స్వార్థంతో విజయుండై తీరును యుధిష్ఠరుడు.
రణఛ్ఛిన్న మనుజ సంస్కృతీలతలో ఫలియించును
శాంతిసుధా ఫలం. కురుక్షేత్ర భస్మంతో అంతమవదు
నరుని పథం; నరుడింకా పయనించును ప్రగతి వైపు;
నిరాశపడదు మనుపుత్రుడు;
వెలుగొందు నవధర్మ ప్రదీప మవశ్యం."

# షష్ఠసర్గ

ధర్మజ్యోతి! దయాజ్యోతి! ఈ విశాల విశ్వంలో ఎపుడు జ్వలిస్తుంది!
జ్వలించే దెప్పుడు భగవాన్!
ఎండి దగ్ధమైన భూదేవి బిడ్డల హృదయా లెప్పుడు ప్రభూ!
-ప్రేమ జ్యోత్స్నాకాంతుల మునిగి ఆర్ద్రమౌట.

వర్షించె నపార పారావారంగా ధరిత్రిపై అమృతవృష్టి
కా నదేం చిత్రమో కాలే దింతవరకు ప్రపంచం ప్రశాంతం.

మానవ హృదయ సముద్రంలో ఈనాటికి లేస్తున్నవి,
ఉత్తుంగ భోగ పిపాసా తరంగ తురంగా లుద్దండంగా.
నిస్సహాయ మానవ హృదయపు టాశలు, ఆకాంక్షలు,
ఔతున్నవి వ్యర్థ దివాస్వప్నాలు. భీష్ముడు, ధర్మసుతుడు, శ్రీకృష్ణుడు
సిద్ధార్థు డశోకుడు, గాంధి, క్రీస్తు
ఎందరు మహామహుల ప్రసవించి ప్రసాదించె నీ ధరిత్రి.
ఎందుకనో తెలియరాదు అందరినీ తనకంటే
అధికుడుగా భావిస్తాడు నరుడు. శరణం గచ్ఛామి;
శత శత నమస్సులంటూ సాగిలపడతా డతి వినయంగా.
ఎవ రెరుగరు యిది హృదయాంతర భావం కాదని.
ఎవ రెరుగరు యిది. మొమాటపు పెదవి సహానుభూతని.
పొరుగువాణ్ణి పీడిస్తూ తానూ పీడింపబడుతూ
అనాది నుండీ నడచిన ఆ రోత, పురాతన, పాచి బాటనే
నడువసాగె నీ నాడూ నరుడు. దోపిడి పరపీడన ఆనాటిదె.
అదే అదే పైశాచిక యుద్ధయాత్ర.
సాటి నరుల విధ్వంసంలో అభ్యుదయాన్వేషణ!
శీలం, పరస్పర సద్భావం పరిహారం చేయలేని
పరస్పర కలతలు. ఉండి ఉండి కృపాణధారియై
ఉన్మాదివలే ఉరుకులు, పరుగులు. విద్రోహంపై ఈనాటికి అనురాగం.

మానవ ప్రాణాల్లో ఈనాడూ విషోరగం బుసకొడుతున్నది.

నరుని బ్రతుకు గతంవలె కాదు నేడు నికృష్టం.
ద్వాపరం దాటి గడిచె ధరిత్రి శతసహస్రయోజనాలు.
ఇది విజ్ఞానయుగం. నరుడిప్పుడు పరిపూర్ణుడు;
సర్వసమర్థుడు. ఈ సమస్త సృష్టిరహస్యం
నరుని చేతి ఆమలకం. మేధస్సును చుక్కాని ధరించి
అంధకార గర్భం ఛేదించాడు నరుడు.
వెలుగును సాధించాడు. నవ ప్రభా విభాసితమై ప్రకాశిస్తోంది ధరిత్రి.

క్రొత్తదనం, వింతయు జతగూడిన చిత్ర రసాయన మీ లోకం.
ప్రకృతి సమస్త మీ రోజున నరునకు బానిస.
నరుని కరాల సత్తువ అరికట్టెను వారి ధార.
మేఘాల్లో విహరించే విద్యుత్తు చేస్తున్నది చాకిరి నరునకు.
జలోద్భూత మహాశక్తి ఆవిరి చేస్తున్నది ఉపచారం.
మానవ కరచాలన పాలిస్తున్నది వాయువు వినమ్రమయై.
నరుని పెద్దతనం కొనసాగని స్థలం మచ్చుకైన శూన్యం.
నదులు, గిరులు, సముద్రాలు సర్వం సమాన మీ యుగాన నరునకు!

నరుని ఆజ్ఞ మహా ప్రసాదంగా ప్రకృతి సమస్త శక్తులు
చేస్తున్నవి నరునకు దాస్యం. వరుణుడు గడగడమని
నరునకు జోహా రనసాగెను. నరుని ధాక కడలి గగనం
వాడికి వాహన మయ్యెను.నవ్యనరుని భయంకర దంష్ట్రల పాలై
దిక్కులు, కాలం ఒక్క చోట సమీకృత మయ్యెను.

అంతులేని అభ్యుదయం; వినని, కనని వికాసం;
చరణ కమల దాసి ధరిత్రి; పిడికిట అనంత ఆకాశం.
ఎంత ప్రగతి! ఎంత పురోగతి!

జరిగింది హద్దెరుగని బుద్ధి ప్రగతి. కాని హృది మేధకు లోబడ్డది.
నరుడు ప్రతినిత్యం చేస్తున్నాడు మేధోత్సవాలు.
కాని హృదయాంతర దేవత ఘోషిస్తున్నది అంతేలేని దఃఖంతో.

విజ్ఞానంతోనే తీరదు మనుజుని తహతహ
కావాలి నరహృదయానికి ప్రేమా, బలిదానం.

కావాలి నర హృదయానికి మెత్తని, సుకోమల భావం;
అగ్ని స్పర్శయె తరువాయిగ కరిగి ద్రవించి ప్రవహించెడి
క్రొవ్వు దివ్వె స్వభావం. ఎండి మొండి బారిన
ఘోరాటవి వంటి మనస్సులలో
హసించాలి సుందర, సుకుమార కుసుమం.
ఎదలేని మేధ సహారాలో ప్రవహించాలి సుకోమల భావ ప్రవాహం.
వినపడాలి వెన్నెల గానం; ఉషస్సు చిరునవ్వులు;
తననే మరిచి స్రవించే సుధా నదీ గాన ధార.
ఆనంద డోలికలలో ఊగే నవ్వీ నవ్వని పువ్వుల
దివ్యానంద సురరాజ్య సుఖం. ఆకులపై పడు హిమబిందుల
కోమల మధుర ధ్వని. కంటిధారలో కరిగే
పీడిత సజీవ చిత్ర పటం. అమందానంద మహాసముద్రంలో
తేలియాడు సుఖప్రసూన మాల.

ధూమం, కల్లోలం, అలసట నధిగమించి చేరిన పిమ్మట తీరం,
కావాలి నరునకు మెల్లగ ప్రవహించే చల్లని జలప్రవాహం.
నరుడు తన సెలవుదినాలు, సాయంసమయాలు
హాయిగ గడిపేందుకు కావాలి, కమ్మని విశ్రాంతి ప్రసాదించు వృక్షఛాయ.
పని! పని! పని! – పనితో నిండిన
ఈ జగత్తునుండెలాగో సాధించి కాస్త విరామం
ఏకాంతంలో- కుసుమంవలె విచ్చిన హృదయంతో
హాయి గొల్పు సాయంత్రం రెక్కలు ముక్కలు జేసుక
దిన మంతా చేసిన తన కష్టానికి ఖరీదు కట్టగ,
తన్ను తాను తన్మయుడై సమీక్షించుకొనగ,
కావాలి నరుని కొక్క ప్రశాంత ప్రదేశం.
వలసిన దానికి మించి సుఖించిన దేహంలో,
కావాలంటున్నది హృదయం తనకొక లఘుగేహం.

అరే నరుడా! నియతి దాసుడా! మనుసూనుడవే! నిను నీవే
చేసుకొనెదవా అపహాస్యం. భేదించి ప్రకృతి రహస్యం
అంబుధినుం డాకాశందాకా సమస్తం గడగడ లాడించావ్.
నిజ మేధస్సుతొ గుణించావు సృష్టి వైశాల్యం.
బ్రద్దలు చేశావనంత అజేయ పరమాణువునే!

మేధో గగనంలో ఆధారం లేకనే చేస్తున్నావ్ విహంగ విహారం.
ఐతే యింతకు ఏ దిక్కుకు నీ యానం? ఎక్కడ నీ లక్ష్యం?
ఏమిటి దా నర్థం? అయితే యిది అజ్ఞాతం–విజ్ఞానమనర్థం వ్యర్థం.

ఆకాశారూఢుడనై ఆలిస్తున్నావ్, గ్రహాల తారల గుసగుసలను.
ఐనా ఒక విషయం – అతి లఘువిషయం అర్థం కాలేదు నీకు.
విశ్వంలో నలుమూలల నిండెను. లాలసాంధకారం.
ఆ పెంజీకటి రాత్రి జిక్కి భ్రాంతుడై తనను తానె మ్రింగసాగె మనుజుడు.
తానే తన కెరయయ్యెను మానవుడు. మేధలో గగన సౌరభం,
శరీరాన రుధిరపు రొచ్చు. మాటల్లో మహామహుడు; చేతల్లో నీచ మృగం!

సామాన్యుడు కాడీ నరుడు. విహరిస్తోందతని వాహనం గగనంలో.
కంపిస్తున్నది పరమాణు వితని కరాలకు. గిరులు, సంద్రాలు, భూఖండాలు,
అనంత ఆకాశం తమ ఎద విచ్చి వినిపించేశాయ్,
గుప్త చరిత్ర సమస్తం పూర్ణంగా; తొలగెను తెర సంపూర్ణంగా.
తెలియని దేమున్న దిపుడీ నరునకు!
ఐనా కావాలి నరున కేదో ఒక దుర్ఘట విఘ్నం;
మెదడుకు మేత; సరి క్రొత్త సంఘర్షణ. నవోత్కర్షకు నవ్య జయక్షేత్రం.

ఈ పరిచిత, పరీక్షిత, రుచి హీనధరిత్రి
ఈ పఠిత గ్రంథంలో ఏమున్న దిక నూతనోత్సాహం నరునకు?
గ్రంథపు ప్రతి పుటతో పరిచితుడీ నరుడు.
ఈ భూగోళం నరుని కరతలామలకం. ఐనా నర ప్రతిభ నిరంతర గతిశీలి.
ప్రచండ శక్తిశాలి. విరామ విశ్రాంతు లెరుంగని
అప్రతిహత పురోగామి. ఈ పరీక్షిత ధరిత్రి;
ఈ పురాతన పఠిత గ్రంథం ఏమివ్వగలదు మేధ కాహారం?
ఇది లఘుభూగోళం; సంకుచితాకాశం;
పాపం! ఏం చాలుతుంది నరునకు? ఏదో కావాలి మరో విశాల విశ్వం.

కటకట పడుతున్నది నరుని మేధ శ్వాస కవకాశం దొరుకక.
వాంఛిస్తున్నది మరో మహాజగత్తు; కావాలి మరో విశాలకాశం.
అన్య గ్రహ జయదాహ తప్తుడీ నరుడు; భూగోళంతో తృప్తిపడడు.
శశితో, అంగారకుతో బహుశా భాషించగలడు నరుడతి త్వరలో.

విశ్వసుందర ప్రకాశ మీ నరుడు. అవని, అంబరాలికపై
దాచలేవు నలుసైనా, నరుని కళ్ళు గప్పి. ఈ నరుని తీక్ష్ణదృష్టి కదలి
చేస్తున్నవి ప్రణామాలు సమస్త చరాచరాలు.
సామాన్యుడు కా డీ నరుడు. సృష్టికి శృంగారం;
అమూల్యాభరణం. జ్ఞాన మందిరం; విజ్ఞానపు కేంద్రం.
ఉజ్వల జాజ్వల్యమాన ప్రకాశాగారం.

అమాయక ప్రాణులారా! అంగారక వాసులార!
వీనులున్న వినండి! మీ లోకం చేరుకొనగ
పదరాని పాట్లు పడే ఈ నరుడింకా నరుడు కాడు.
జంతువు కేవలం జంతువు. స్థూల జగత్పరిశోధనోన్మాదంలో
మునిగిన రక్కసమేధస్సితనిది. దురభిమానోన్మత్త నరుడొక్కడు
గర్జిస్తే చాలు; మరుక్షణం ధ్వనిస్తాయి లక్షలక్ష మృత్యువాద్యాలు.

పేరుకు విజ్ఞా నీ నరుడు; నక్కలు, కుక్కలు నయం వీడికన్న.
నరు డొడిగట్టని క్రూరకర్మ లింకేమున్నవి ధరణిపైన.
మనస్సూ, ప్రాణం తనువుతోడ జతయై ఒక్కుమ్మడి చేస్తున్నవి సంగ్రామం.
ఈ విధ్వంసానికి మారణ హోమానికి కళలూ, విజ్ఞానం, చేస్తున్నవి సాయం.
ఈ నరుని దుష్టహస్తగతమై విజ్ఞాన ప్రసూనాలు విస్మరించి తమ
విశ్వకళ్యాణ ధర్మం. రూపొందెను కర్కశ, కఠోర వజ్రాలుగ.

విజ్ఞాన ఖజానా నరుడు! సృష్టి కెల్ల శృంగారం మానవుడు!
ఐతే బిరుదు గాంచి భ్రమ చెందకు. ఆచరణను తరచి చూడు.
సంహారప్రియుడీ నరుడు. పిపాసా దాసుడీ మానవుడు.
వీడి ఊహ కూహకం. పాషండ జ్ఞాని వీడు.
వీడిని నరుడనటం ఘోరం; అవమానం మానవతకె!

అంబరం మొదల ధోలోకం వరకూ
సమస్తం జ్ఞాతం నరునకు. ఐతే మానవుడింతే కాదు.
కేవల మీ జ్ఞానంతోనే లభించదు మానవ శ్రేయం.
మేధను జయించాలి చైతన్యం నిండిన హృదయం.
నాడే నరునకు క్షేమం. నరుని నరుని మధ్య పెరగాలి
సీమలే లేని ప్రేమ. నాడే మానవ కళ్యాణం

నరుని నరుని మధ్య అంతరాల ఛేదించిన నరుడే మానవుడు.
విద్వాంసుడు, విజ్ఞానీ వాడే. నిజం! వాడే మానవుడనదగినవాడు.

బుద్ధికి భృత్యుడై పరమాణువు మాత్రం ఛేదించే నరుడు
అంతరాల ఛేదించని నరుడు కాదు వాడు మానవుడు.
కావచ్చు నరాధికుడు; కాకుంటే నరాధముడు; కానేకాదు మానవుడు.
ఏదో అజ్ఞాత గ్రహ ఖండం; విచిత్రపు జీవం, అంగారకలోకం నుండో,
శనీచరలోకం నుండో, పొరపాటున జారిపడ్డ బాపతు.
అందుకనే అహరహమూ అందుకొనగ తన గ్రహాల అంతులేని ఆయాసం.

రత్నగర్భ ధాత్రీపుత్ర శ్రేయం కాదీ విజ్ఞానం.
ఇది అగ్నిగర్భ ప్రతిభ. విశ్వదగ్ధకారీ విజ్ఞానం.
మృత్యుదేవి పల్లకిబోయీ యిది. సృష్టి కెల్ల విచార చిహ్నం.
దారి తప్పి, అడ్డం పడి, అడ్డెరుగక, గ్రుడ్డిగ నడచే,
అభిశాప మీ విజ్ఞానం. భ్రమిత ప్రజ్ఞా కుతూహలం.
విచిత్ర మహేంద్రజాలం. ఈ అవిత్రావిష్కరణల్లో
శూన్యం నరజాతికి శ్రేయం.

ఖబర్దార్ మానవుడా! విజ్ఞానం కృపాణమైతే విసర్జించు విజ్ఞానాన్నే.
త్యజించి వ్యామోహం, విస్మరించు విజ్ఞాన శబ్దం సైతం.
విస్పష్టం బయ్యేను నిశ్శంకగ కుసుమ కంటకాల కంతర
మిసుమంతయు తెలియని పసిపాపడివని. ఇది ఖడ్గంతో చెలగాటం.
తెగును అవయవాలు. పదునైన దీకృపాణం; జాగ్రత!

రత్నగర్భ ధాత్రీపుత్ర శ్రేయం లేదీ సెగలు గ్రక్కు విషవిజ్ఞానంలో.
ప్రజ్వలించు మానవ శ్రేయం నరుని జీవనాడుల్లో విద్యుతువలె ప్రవహించే
ఉజ్వల లనురాగంలో. ప్రకాశించు మానవ కళ్యాణం
సాటి నరుని శ్రేయానికి ఆత్మార్పణ చేసెడి మానవ బలిదానంలో.
నరజాతికి శ్రేయం- ఎద కరిగి ప్రవహించే
కన్నీటి ప్రవాహంలో; భగ్నవీణ వ్యాకుల తంత్రీనాదంలో;
ఉన్నత, ఉత్తమ భావజగత్ ప్రబోధ గీతంలో,
నరజాతికి శ్రేయం- జ్యోతిర్మయి ఆత్మకిరణ రేఖల్లో;
ఆహుతిలో; అర్పణలో; ఆత్మత్యాగంలో; ఉజ్వల తపస్యాగ్నుల్లో.

నరజాతికి శ్రేయం- సర్వనరుల హృదయాలను
స్నిగ్ధ, సౌమ్య, పునీత మొనర్చెడి బుద్ధిమథిత నవనీతంలో.
అందుబాటు నుండా లందరికీ విజ్ఞాన వరాల ప్రాకారం.
మానవ మేధ మంగళావిష్కరణల్లో నిబిడమైంది మానవ శ్రేయం.
సర్వజనుల సౌఖ్యాలకు ఊయెల కావాలి సృష్టి.
నశించాలీ నరశ్రమ దుర్వినియోగ వ్యాధి.
మానవ సుఖసంపదాభి వృద్ధి పథంలో
పురోగమించాలి ప్రకృతి సమస్త శక్తులు.
మానవ కళ్యాణం సమతను చాటే జ్ఞానంలో
ప్రేమపూర్ణ న్యాయం పునాదైన నవ్యజగత్ నిర్మాణంలో;
వ్యక్తిపైని వ్యక్తికి హృది జనించు అంతులేని ధృఢవిశ్వాసంలో.
మానవ కళ్యాణం- సంగ్రామం, పీడన, పతనం,
మచ్చుకైన కానరాని విధ్వంసంతో దగ్ధమవని,
కుట్రల, కూహకాల కాహుతవని,
చరిత్రపుట సముదాయ సమన్విత,
ధర్మదీప్త మానవ ఉజ్వలేతిహాసంలో.
మానవ కళ్యాణం- ప్రతి ఒక మానవ హృదయం
సంతుష్టానంద మహాసంద్రంలో
తేలి ఓలలాడ వీలుండే సుధాపూర్ణ మానవేతిహాసంలో.

యుద్ధజ్వరాంత మే నాడౌనో
నిజం! సుధాసిక్త మౌతుంది వసుంధర.
నరరక్తసిక్త మేనాడవదో ధరిత్రి నాడే, ఆనాడే,
పురోగామి నరజాతికి భవిష్యత్తు.
నరుని నరుని మధ్య అరమర లెరుగని
సరళ, సరస, సమరస సంబంధం
స్థాపిత మే నా దగునో నాటి నుండె, ఆనాటినుండె
ధర్మదీప్త విద్యుత్ప్రభ ఔతుంది మానవునకు మార్గదర్శి.

స్నిగ్ధ, ఉదాత్త సమతోద్యానం పుష్పించే దెప్పుడు!
ఎప్పుడు ప్రభూ పుష్పించుట!
ఎండి దగ్ధమైన పుడమితల్లి పుత్రుల హృదయా లెప్పుడు భగవాన్!
ప్రేమజ్యోత్స్నా కాంతుల మునిగి ఆర్ద్రమౌట!

# సప్తమ సర్గ

రాగానల గ్రస్తుడయ్యు స్వర్ణంవలె వెలుగువాడు;
చీకటి సంద్రాన మునిగి వెలుగును శోధించువాడు;
అడుసునుండి వెలువడ కడు యిడుమల బడు కమల సముడు;
మేఘపంక్తిలో మునుగుచు, తేలుచు,విముక్తుడౌ శశిబింబ ప్రతిబింబం
వాడే పో మానవుండు! వాడే పో దివ్య నరుడు!

అగాధ పాపకూప వాసీ! సరళ, అమాయక మనుపుత్రా!
జ్యోతిసంభావా! నరుడా! నీ కిదే జయోస్తు; విజయోస్తు!
అంధకార పిశాచి కే నరుని మేధో కిరణందాసోహం బనలేదో,
శతసహస్ర, సన్యాస సమూహం తుచ్ఛం బా నరుడొకనికి.

ఇహమంటే గడగడ మను  మహామహులపై లేదీ మహిభారం.
అహరహమూ శ్రమించి మట్టి నుండి మాణిక్యం వెలయించెడి
నరులే ఈ భువి కాధారం. కరాళ పంచాగ్నుల కెరయై కాలెడి
జగత్తు  త్యజించి చిత్తగిస్తారు పలాయనం యోగులు.మృత్తికను దహించి,
పుటం వేసి  పవిత్ర భస్మంగా మారుస్తా రనాసక్త రసభోగులు.

పెను చీకటి గడచిన పిదపే వెలుగుబాట లభ్యమగుట.
రాత్రిమీద స్వారీ చేస్తూనే ఏ తెంచును ఉషఃకాంతి.
ఏనాడూ పాపం చెయ్యని నరుడెవడీ భువిలో?
వైతరణీ ప్రవాహాన మునగని మొనగాడెవ్వడు?

ఆదినుండి అంతం వరకే పథం సదా ఉజ్వలం?
అంధకార బంధనాల తెగద్రెంచ నశక్తుడెవ డీ భువిపై?
తమ అనుదిన జీవిత పథాన సూర్యచంద్రు లిరువురు రాహుగ్రహ భీతులు.
ఔతారు రాహు గ్రసితులు. తిరిగి విముక్తులౌతారు. దుష్ట దంష్ట్ర కెరగాకనె.

మిట్టపల్లాల మార్గంలో పడుతూ లేస్తూ,
పయనిస్తున్నాడు నరుడు. -ఒకప్పుడు పాదచారియై,

ఒకప్పుడు పుణ్యరథారూఢుండై- పశ్చాత్తాప్త పాపాత్ముడు
పరాక్రమి పురుషుడు చీకటితో ఘర్షిస్తూ
వెలుగు భూమి దెస చేస్తున్నా దెదురు లేని పురోగమనం.

నర నేత్రాల్లో దుఃఖ ద్రావక శక్తులు నిర్జీవ కానంతవరకు,
ఒరుల కష్టకథా శ్రవణం నర హృదయం దగ్ధపరుచగల్గువరకు,
పుణ్య బలాభిలాషకు స్థానం బున్నంత వరకు-
అంత వరకు అక్షీణం నరునిలో మానవతాకాంక్షలు.
అంతవరకు చిరంజీవి మానవత్వ ఆశాకిరణం.

పుణ్యం పాపంబను యిరు రెమ్మలపై కుసుమిస్తుందీ ఆశ.
కురుక్షేత్ర చితాభస్మంలో సైతం నిబిడమైనదీ అభిలాష.
ఏ నరుడీ సత్యం గుర్తిస్తాడో, అతడే సాత్విక ధర్మ ప్రవర్తకుడు. అతడే
సత్సేవకు డతడే సమాజ ప్రియుడు.
ఉత్తముడూ, అధినేతయు అతడే, అతడే!

రోదించగ, రోదించగ అధీర అంతరాత్మ కన్నీళ్ళతొ కడుగ కడుగ,
తుద కగుపించెను. యుధిష్ఠరున కాశాజ్యోతి. కర్మభూమి యెడ
విరక్తుడు రక్తుడగుట గని యుధిష్ఠర మనోగత భావాలనె
పునశ్చరణ గావిస్తూ పలుకసాగె భీష్ముడు- "కురుక్షేత్ర భస్మం,
బీభత్సం కాదోయ్ మానవ ప్రగతి పథాంతం.
నిజం! యిట శోకం వర్షించెను. కానిటనే-సందియ మెందుకు!
వికసిస్తా యవశ్యం ప్రశాంతి ప్రసూనాలు.

"ధర్మజా! అల్లదిగో! ద్వాపరాంత మౌతున్నది కన్నావా?
అలలో విలీనమైతోందొక మహాసాగరం.
తన సమృద్ధి సర్వం తనతో గొని,
శాశ్వత విశ్రాంతిపత్ర మర్పించీ లోకానికి
తన దోవన వెళిపోతోందొక కాలఖండం.
సమరధూళి కట్టిందొక యుగానికే సమాధి.
ఐనా జీవిత జీవధార ఈనాడూ ప్రవహిస్తున్న దనంతంగ నిరంతరం.
మృత్యుదేవి ఒడిలో గతం. విగతజీవి గతి నున్నది.
భవిష్యత్తు పిలుస్తోంది. ఎలుంగెత్తి మానవుణ్ణి.

"కాలేదీ మట్టిబొమ్మ అస్తిత్వాంతం; ఉపరి భాగమొకటే నశియించెను.
హననం కాలేదీ రణాన నరుని భవిష్యత్తు.
నిజం! నెత్తుట మునిగినది నరుడు కాదే మాత్రం నరుని మానవత్వం.
సంచరిస్తోందది దేహ త్యాగియై, మనోధారియై.
నరునకు నరుడే ఆశా, ఆధారం.
త్యజించి మానవ లోకం శోధించకు వనిలో.
విజేత విషాద విలాపంలో ప్రకాశించు మానవత్వ ఆశాకిరణం.
నరజీవుల ఆశల, అభిలాషల కాధారం నీ అశ్రుజలం.

"రాగ ప్రేరితుడైనందున రణోన్ముఖుడగును నరుడు. కాని నరుని
బుద్ధి అనుక్షణమూ విరక్తియే నరుని మనసు చేస్తుంది హాహాకారం.
కాని ఈడ్వబడును కాయంకాల రణానికి కాలగతి ప్రభావాన.
ప్రతీకారోత్తేజిత గర్విత పిపాస హుషారు చేస్తుందొక వైపున.
మానవతా పతనం మనసును మరిపించును మరోవైపు.
వాసనా వైరాగ్యాలను తీరాలతో పడుతూ ఘర్షణ,
అనుభవాల నార్జిస్తూ, మార్గం నిర్మించుకుంటు
సాగిస్తున్నది గమనం మానవతా ప్రవాహం.

"నిశితంగా వీక్షించు. ఈ రాజ్యం రాజ కిరీటం, కోశం జపం, తపం,
యాగం, యోగం సర్వంతల దన్నెడి శిరోభూషణం మానవత్వం.
ఈ భేదాలూ, అంతరాలు ధర్మబుద్ధి ధర్మాలనుకున్నావా?
కానే కాదు! ప్రతి నరుడూ ప్రక్క నరునకుజ్జీయే,
ధనహీన, శక్తిహీన, దీనుడు సైతం మానవుడే.
ధనబల, భుజబల సమన్వితుడును మానవుడే.
సహజసృష్టిలో నరునకు సిద్ధించిన జీవితాన,
అంతర మిసుమంతయు శూన్యం.

"జీవన శృంగాగ్రారూఢుండై చిరంజీవి సమతను వీక్షించగ
ఈనాటికి నరుడసమర్థుడు. నేడూ నరునకు నరుడంటే భయం.
పరస్పరం ద్రోహం ద్వేషం గరళం విరజిమ్ముకు
బ్రతుకుటకలవాటు పడిన శంకాజీవులీ మానవులు; అయితేనేం!
పరస్పరం సంఘర్షిస్తున్నా ముందడగే వేశాడీ నాటివరకు నరుడు.

"మానవ కళ్యాణమార్గ సత్సాధకులై శతసహస్ర నరోత్తములు,
మునిపుంగవు లామరణం జరిపిరి పరిశోధన.
దీని కొరకె జరిగెను సాగర మథనం. విడువబడెను వ్యోమంలో
అసంఖ్య జ్ఞాన శరాలు. ఈ శోధనలోనే నరుడు
పాపకూపమున జిక్కెను. ఈ కార్యానికె అఖండ బలిదానం జరిపెను.
ఈ ఆవిష్కరణకె నరులు విరాగులాయిరి.
మారణ రణాల కారణ మీ పరిశోధనయే.

"నీవూ పరిశోధిస్తావా? ఐతే వెలిగించు నిర్మల విజ్ఞాన జ్యోతి.
త్యజించి కురుక్షేత్ర ప్రేతభూమి పురోగమించు వీరునివలె.
రాగంలో విరాగివి కా! నిర్మల రాజర్షివి కా!
త్యాగం, బలిదానాల బలంతో మానవ మార్గదర్శివి కా!
పతిత మానవ మతి నింపుము మానవతాభావం
బలవంతుని దర్పం హరించు.
హిమశీతల హృదయంలో అగ్ని వంటి అనుభూతి రగుల్చు.
భయానక గర్వాంతర హాలాహలం హననం చెయ్!

"విశ్వంలో సమరాంతం చూడాలని కాంక్షిస్తున్నావా!
ఐతే విష దంష్ట్రల పెకలించుము సమూలంగ.
వృక వ్యాఘ్రపు చెరలనుండి వసుంధరను విడిపించుము.
లేదా మేకపిల్లలను సైతం వ్యాఘ్రా లొనరించుము.
దంష్ట్రల్లో కరాళ హాలాహలం నింపుము. విశాల వటవృక్షం ఛాయన
క్రుంగి కృశించే అసంఖ్య లఘువృక్షాలకు వికసించగ వీలు గూర్చు.
సమస్త భూసారం పిండుకు త్రాగెడి మహీరుహ శాఖల శిఖలను
ఖండించుము నిశ్శంకగ; శాశ్వతంగ నిర్మూలించుము.

"ధర్మజా! తెలుసా నీకీ సత్యం క్రీత దాసి కా దీ ధరిత్రి ఏ ఒకనికి.
పుడమిపైని జనియించిన జనులందరు సర్వసములు సహజంగా.
"ఈ సమస్త ధాత్రీసారం భోగించగ,
అభావాల భావం బెరుగక హాయిగ జీవించగ సర్వజనులు అధికారులు.

"పొందాలందరు స్వేచ్ఛాకాంతులు అందా లందరికీ స్వచ్ఛంద సమీరం.
సమకూరా లందరికీ సహజ సరళ వికాసాని కవకాశం.
ఆశంకల కాస్కార మెరుంగని మధుర జీవితం.

"నిరంభ్యతర గగనంలో నిరంతరం పెరిగెడి తరులవోలె,
లోకంలో ఏదో విధి, తమ వికాస పథాల
చరమ దశను చేరుకొనగ, పురోగమించ వాంఛితురు సర్వ నరులు.

"కానీ మార్గంలో శతాలు విఘ్నాలు.
మానవాతా ప్రగతి నిరోధానికి మహాపర్వతా లడ్డున్నాయ్.

"న్యాయోచిత సౌఖ్యం ప్రతి ఒకనికి లభ్యం కానంతవరకు,
ఈ జగాన శ్రాంతెక్కడ? ఈ భువిలో శాం తెచ్చట?

"లోకపు సుఖసంపదలకు సర్వులవాలి సమభాగులు.
అంతదనుక శమియించదు కల్లోలం.
అంతవరకు శాంతించదు సంఘర్షణ.

"ఉండెడి దతి సహజ సరళ పథం.
తన కాయుష్యం తన కారోగ్యంబని భావించక,
సౌఖ్యం స్వార్థానికి దాచుకొనక సర్వ సంపదలు సమిష్టిగ భోగించెడి మార్గం.

"విస్మరించి దివ్యపథం చిక్కువడెను పరస్పరం, శంకాభీతాహంలో.
తత్పరుడయ్యెను కేవల వ్యక్తిగత స్వార్థపూర్తిలో.

"ఈ వ్యక్తిగత స్వార్థవాద గర్భం నుండే వెలుడె నీ హాలాహల ప్రవాహం.
నర సమాజ మంతా సతమత మౌతున్నదీ ప్రవాహ గతమై.

"ప్రభు ప్రసాదిత అనంత సౌఖ్యాలీ భువిపై విరాజిల్లుచున్నవి.
అవి సర్వం భోగించగ ఏరీ ధరిత్రిపై సరిపోయెడి నరులు!

"అవని నుండి అంబరంవరకేనాడూ తీసిపోని జలం;
అంతులేని ప్రకాశం, స్తంభించని పవనం,

"పూలు, ఫలాలు, ఆహారం, ధనం, మణులు వెల్లువగా పెల్లుబికే ఈ
ధరిత్రి; వేటమృగాల పాలిటి పాలవెల్లి ఈ సఘన, సహజ విపినం,

"అసంఖ్య రత్నగర్భిత ఉత్తుంగ పర్వతపంక్తులు;
కాంతెలీను ముత్యాలూ, అందంచిందెడి పగడాలూ,
లెక్కకు మిక్కిలిగా గల సువిశాల మహాసాగరం;

"ఎప్పటి కప్పుడై ప్రభవిల్లెడి నరుని నిత్య నవీన జిజ్ఞాసలు,
సాగర మంథన దక్షత గల లక్ష లక్ష సుదృఢ బాహులు.

"కన్ను పొడుచుకున్నా సరె కానరాని చీకటిలో సైతం
ప్రతి క్షణమూ ప్రకృతి స్థ నవరూపం, నవ్య రహస్యం
వెలువరచగ కలతపడుచు నిరంతరాన్వేషణ సలిపెడి
నరుని సమున్నత బుద్ధిబలం!

ఈ భుజబల, ప్రజ్ఞాబల ధాటిని నిలువరించు ధీరుడెవడు?
పురుషున కలభ్యమౌ వైభవ మేమున్నది భువిలో?

"ప్రకృతి గర్భంలో దాగియున్న దనంత వైభవ రాశి.
కోరిన సుఖభోగాలతి సరళంగా పొందగలదు.
సమస్త నరనారీ సముదాయం.

"సర్వ నరులు సమభాగులుగా సర్వసౌఖ్య సమన్వితులై
కాగలరు సంతుష్టానంద జీవన పథ నిర్మాతలు. తలంపున్న చాలు!
తృటిలో ఈ భువిసీమను దివిసీమగ మార్చగలరు!

"సమస్త సంపద తెరచాటున మరుగు పరచె పరమాత్ముడు.
నిరంతరం ఘర్షించుచు శోధించుచు సాధించెను
సాధనపరుడైన నరుడు; కర్మజీవి మానవుడు.

"స్రష్టలిఖిత అదృష్టఫలం. కాదీయిల మానవ సౌఖ్యం.
ఈ సుఖసంపద సర్వం తన రుధిర మోడ్చి సాధించిన
నరుని భుజబల ఫలం.

"దోసిలొగ్గి అదృష్టానికి దాసోహంబన దెపుడూ ప్రకృతి.
నరుని ప్రయత్న, శ్రమలకు శిరమువంచు నిరంతరం.
"విధి లిఖితం, విధి లిఖితంబని నినదింతు రకర్మణ్యులు.
చెమటోడ్చి శ్రమించి వీరులు నొసటి వ్రాత హతమార్తురు.

"పాపానికి ఆవరణీ విధివాదం దోపిడికిల దివ్యాస్త్రం.
ఈ అస్త్ర ప్రభావానె ఒక్కడనేకులపై చేస్తున్నాడెదురులేని అధికారం.

"నిలువదీసి ప్రశ్నించడం డదృష్టవాదిని. విధివ్రాతే తిరుగెరుగనిదైతే,
తన రత్న రాసి తనంతట తానే, నర చరణద్వయ సమ్ముఖాన
కుమ్మరించదెందుకనో వసుంధర?

"ప్రకృతి సమస్తం పవిత్ర జలంతో నింపి నింపి సృష్టిస్తుందేం సంపద?
తన సమకూర్చిన పూర్వ పుణ్య అదృష్ట బలప్రయోగం
ఎగనెత్తుకు రాలేదూ, సమస్త ధాత్రీ విభవం?

"గత జన్మా నొకానొకడు గడించి గతించాడనుకో
అంతులేని ధనరాసులు; పయనించే గడియ నమరి
తన ఆర్జిత విత్తంబీ భువిలో ఏ గృహాన తాకట్టుంచెనో
తెలుసా అతనికి?

"జన్మించీ రోజున అధికారం సాగించే సదనం బల్లదియేనా?
ఈ సంపద సర్వస్వం గత జన్మపు కుదువంటావా?

"ప్రశ్నించా సుకృతవాదిని. ధనసంచయ మారంభించిన
తొల రోజుల్లో ఆ సంచయ తత్వపుటాధారం ఏ అదృష్ట పరంపర?

"అదే నరశ్రమ ఫలాపహరణం; అల్లదే అక్రమ పీడన.
సంఘానికి విద్రోహం; అల్లదే శోచనీయ సముపార్జన.

"కుదువరాని కూళ్ళు కుడిచి లక్షలక్ష పాపాలకు లోబడి
అర్జించును లక్ష కొకడు. 'అదృష్టం,' 'పూర్వజన్మ సుకృత' మంటూ
ఆ సంపద భోగించగ దక్షుడ, అధినాధుడనని
బయలు దేరు మరొక వ్యక్తి

"బాహుబలం శ్రమలే నరజాతికి సౌభాగ్యం.
అవని అంబరాలు, పాతాళం సైతం
దోసి లొగ్గి ఆ శక్తికి దాసోహం బని తీరును.

"చెమటోడ్చిన శ్రమజీవుల కడుపు గొట్ట నొడిగట్టకు.
ప్రకృతితో ఘర్షణపడి సాధించిన శ్రమఫలాలు సర్వ
ప్రత్యేకించుము ప్రప్రథమం శ్రమజీవుల సౌఖ్యానికి.

"మహీనిహిత సమస్త విభవం నరమాత్రుని మూలధనం.
ధర్మజా! ఆ విభవపు కణకణమున కధినాథుడు ప్రతి నరుడూ.

"ఈ నరజాతి స్వత్వం సహజ సురక్షతమై యుంటే
ఈ లోకపు రూ పీ రూపున నుండెడిదా?

"సర్వం తలదన్నిన సంపద శ్రమయే. సర్వులు ఆర్జింతురు నిక్షేపం.
సర్వ జనులు కాగల రభావ రహితులు.
సర్వులకూ సమకూరును వాంఛిత సుఖాలు.

"రాజులు ప్రజలను అంతర ముండదు. నరులందరు నర మాత్రులె.
పీడించదు నరులను విధి లిఖితం పాలించును భువి కర్మనిష్ఠ బాహులు.

"ఈ భువిలో ప్రభువెవ్వడు? ఎవడికి ప్రభు వాతడు?
ఈ జగాన పాలితులెవ్వరు? గుత్త గొన్న దెవరీ ప్రజలను?
నరుడే తన భ్రాంతబుద్ధి కెరయై, చేజేతుల నాహ్వానించెను
శృంఖలాల; బంధితుడయ్యెను బంధనాల.

"అనిలం సలిలం సులభ్య మీ జగాన జను లందరకూ.
అదే విధి గత కాలంలో, అందుబాటు నుండెడి దందరకూ,
మహీనిహిత సమస్త విభవం.

"ప్రేమించేవాడు నరుడు తోటి నరుని. విశ్వసించేవాడు వ్యక్తిని వ్యక్తి.
పరశ్రమ ఫలాపహరణం నిషిద్ధ నియమం.
కర్మనిష్ఠ సన్యాసులు జనులందరు.

"ధర్మబంధ బంధితులై జీవించేవారు జనులు. హర్షంతో పరస్పరం
పాలు పంచుకొనెడివారు విషాద, విపత్కర వేళల్లో.

"ఉచ్చ నీచ భేదం బిసుమంతయు శూన్యం.
జనులందరు సర్వసములు. నర సమాజ ముండెడి
దేకైక కుటుంబంవలె. అందరికీ అందరిపై నుండెడి
దగాధ మమత్వం.

"నుదుము వంచి కష్టించేవా రెల్లరు. వలసినంత భోగించెడివారందరు.
ఏనాడూ ఎవడూ తా నధికుడనని తలపోసెడివాడు కాదు.

"సమిష్టి భావ బంధితు లెల్లరు. ఏ ఒక్కడు వేరు కాదు.
సమాజ సౌఖ్యానికి భిన్నమైన సుఖ మే నరుడూ ఎరుగడు.

"తస్కరించి సమాజ గ్రాసం తన ఉదరం నింపుకొనెడి
స్వార్థపూర్ణ సంచయ తత్వం మచ్చుకైన శూన్యం నరునకు.

"శూన్యం రాజూ ప్రజలను భేదం. శాసనం కాదు శాసించేది
మానవుణ్ణి. సమాజ సమస్త జన మనముల
నేలెడి శక్తులు నీతీ, ధర్మం.

"దండనీతి అండతొ ఈ దినాన రక్షణగొను వ్యక్తి స్వత్వాలను
సన్మానించెడి వాడొక రోజున
ధర్మబద్ధ నరుడతి సహజంగా ఎంతో సరళంగా.

"జీవితాని కాదర్శం రుజుమార్గం నలుమూలల ఎటు చూచిన
ప్రత్యక్షం నిరాటంక దిశా సమూహం. అడుగడుగున అడ్డుకొనెడి
రాజనియమ పర్వతాలు శూన్యం బా దినముల.

"లక్షించిన లక్ష్యం ప్రతి నరునకు సిద్ధించెడి దతి సహజంగా.
నిజ వికాస చరమసీమ నిశ్శంకగ చేరువాడు.

"ధరించి స్వార్థపు వేషం జొరబడెనప్పుడు కలిభావం,
నరుని మనోగేహంలో. వ్యాపించగ సాగెను లోభవిషం,
జీవితాన అజ్ఞాతంగా.

"విరుచుకు పడ్డది కరువొకపరి. మరణించిరి నరులెందరో.
శేషిత జీవితులెల్లరు, అల్లాడిరి; తల్లడిలిరి. నర హృదయంలో
ఏదో తెలియని కోణంలో తల ఎత్తిన లోభం విప్పెను తన విషపు నోరు.

"అయ్యో! కొంతకు కొంతైనా, నీ సొంతానికి సంతన జేసుకొనుంటే,
ఈ రోజున ఈ సంకట సమయంలో, కలిగెడిదా విలపించెడి దుర్గతి?
"అందరి వలెనే నీ పైకిని ఉరికెడిదా ఈ విపత్తు!
లే! మూర్ఖా! లే! ఇపుడైనా జాగ్రత్తపడు రేపటికై.

"ఇంకేం! అంతు లేని పశ్చాత్తాపంతో
నెత్తినోరు కొట్టుకొనుచు మత్తువీడె మానవుడు.
సాటి నరుని కళ్ళుగప్పి సాగించెను తనకై ధన సంచయనం.

"ఒక నరుడెటు పయనిస్తే అటకే సాగెను సమస్త నర నారీ సముదాయం.
ఎవరికి వారై తమ తమ ఆత్మరక్షకై సాగించిరి వేరు వేరు యత్నాలను.

"గరళం విరజిమ్మెను లోభ భుజంగం. తక్షణమే జరిగెను నాందీ ప్రస్తావన-
దొమ్మీలకు, చౌర్యాలకు; తన్నులకూ, గుద్దులకూ; దోపిళ్ళకు, దౌర్జన్యాలకు.

"విచ్ఛిన్నం బయ్యెను సమూలంగ నర సమాజ బంధాలన్నీ.
పాపం మునుగ సాగె మహి అంతులేని కల్లోలంలో.
"అప్పుడు తెర ఎక్కెను ఖడ్గం జగద్దహన శాంత్యర్థం;
మానవ హృది చెలరేగిన లోభ భుజంగ మద హరణార్థం.

"ఖడ్గధారి, పరాక్రమి పురుషుడు నరపాలకు డయ్యెను. దండనీతి
ధరుడయ్యెను. నరాంతర్గత దనుజుని హనన మొనర్చు మొనగాడయ్యెను.

"నిజసుఖ భోగాలను త్యజించి సమష్టిని
విజృంభించె వ్యష్టి. తుద కగాధ దాసత్వపు గోతికి
తనకు తానె తెలియకుండ తనంతట తానే బలియయ్యెను.

"నరుని ఎడల నరునకు సహజమైన అనురాగం
అంతర్హిత మవ దీ భువిలో- కనీసం
నిజ పరిజనములనైనా వంచించగ వెనుకాడినచో,

"నరునకు సాటి నరునిలో అచంచల విశ్వాసంబున్న యెడల
నిజ సుఖ లాలసలో పరసౌఖ్యం మరువనిచో,

"తానెవరో కాదని మానవుడని ఇంచుక స్మృతి యున్నచో,
మేధో సంపద గల మనుసూనుడనని, పశుపక్షుల కన్నను
మిన్నయైన మహత్తర యోనిసంజాతుడనని ఇంచుక స్మృతి యున్నచొ.

"నరుడెన్నటికీ ఒల్లడు తన గౌరవ సుఖాల ధారపోయ;
ఏ రాజశక్తికో వినమ్రుడై దోసిలొగ్గి దాసుడవగ.

"సహజ సుకోమల స్నేహసూత్ర బంధితుడవ నొల్లని నరుడే
వశుడయ్యెను కర్కశ దండనీతి పాశానికి.

"ప్రేమ, న్యాయం పునాదిగా సాటి నరుని సుఖభోగపు వాటా
ఇచ్చుట గిట్టని నరుడే, ఇచ్చుట కిచ్చగించె నీ దినాన
అవనీశుని అసిధారకు భీతిలి.

"సత్యం, న్యాయం ఆధారం బగు
సుశీతల భావాలను అపహాస్యం చేసిన వరునకె,
నే డౌతున్నది అవగాహన కత్తుల కర్కశ భాష.

"ఇంతకు మించిన పతనం బేమున్నది నరజాతికి?
ఇంతకన్న కాగలదా మానవ గౌరవ హననం?

"అక్రములను, అవినీతుల నదుపు చేయ
కావాలి నరజాతికి కృపాణ పాణి నృపాలుడొకడు.

"కావాలి నర జాతికి నృపుడొక్కడు. మరి నరులా కొట్టుకు చస్తుండిరి.
కావాలి కృపాణం మరి; న్యాయశంక లేనే లేదాయె నరులకు.

"నరులను పశువులవలె నడిపించగ, అక్రమదూరుల నొనరింపగ,
అడుగడుగున న్యాయం, ధర్మంబని హెచ్చరించ కావాలొక అవనీశుడు.

"జన మన దద్దమ్మతనం బర్థమైన, క్షణ క్షణమూ రేగెడి
పరస్పర కలహకీల నార్పగ కావాలొక చక్రవర్తి.

"అత్యావశ్యక మొక భూపతి. లేకుంటే యింకేమున్నది?
కలబడి కలహిస్తారు నరులు. పరస్పర రుధిరంలో పోరుచు
మునిగి మునిగి నశిస్తారు.

"నరుని నీచ నికృష్ట ప్రకృతి ప్రతిబింబ మీ రాజనీతి.
మానవతకు తలవంపులు. భయానక సంస్కృతీ కళంకం.

"దారుణ విజృంభణ నరికట్టగ అవతరించె గా నిది- స్వచ్ఛంద,
సజ్జన జనాంతర్గత ప్రతిభాయుత మేధకు హద్దుల బంధింప గాదు.

"అట్టిది నే డెట్టిదిగా మారెనొ వీక్షించావా? భావ వికాసం
సైతం శాసిత మవసాగెను. రాజ నియమబద్ధ మవని
కర్మొక్కటి కాదు నిషేధం; నిషిద్ధ మాలోచన సైతం.

"కావచ్చు విదురుడు! ఔగాక శ్రీకృష్ణుడె! ఎవరైతేనేం?
వర్తించును రూళ్ళకర్రవలె సమానంగ శాసన నియమం.
జనులందరి మనో వచన కర్మలపై ప్రత్యక్ష మీ కసాయి శాసనక్రమం.

"ఆ సజ్జన జన కృత్యములను రాజశక్తి కయిష్టం బైనచొ
దాని ముందు గడ్డి పోచ సరి యా దొడ్డ దొడ్డ వారంతా.

"శాసన లక్ష్యం బొకే ఒకటి. 'ప్రస్తుతాన్ని' సంరక్షించుట మది.
సాగరాదు జీవన ధార మరో నవ జగత్తు దెస.

"పరంపరకు భిన్నంగా నోరు మెదపరా దే నరుడూ.
వెలువరచగ వీలు లేదు. నవధర్మ రహస్యం స్వేచ్ఛగ.

"భయానక దుస్తంత్రం కుత్తుకపై నెత్తుక
జగత్తంత తిరుగ సాగె తన వ్యక్తిత్వానికి స్వస్తిజెప్పి.

"తన మనస్సుపై తనకే లే దధికారం. చేసే దేమున్నది నరుడిక!
అందుకనే తన జీవన శిరోపరిభాగంపై
తెచ్చి పెట్టుకొనె చేజేతుల కత్తుల ప్రహరీ.

"మరి నే డా ప్రహరీ నరుణ్ణి అటు యిటు మెసలగ సైతం
ససేమిరా యనసాగెను. పరంపరను తృణీకరించి స్వచ్ఛంద
వికాసం చెందగ అవకాశం నిరాకరించెను.

"కానీ స్థితి నరుడే సంభవ మొనరించెను తన వికృత చేష్టలతో.
పరస్పరం ఘర్షించుచు దీనికి నరుడే ఆదర మిచ్చెను.

"మానవ మనోంతర్గత స్వార్థపు కొండలు పిండైపోనంతవరకు,
అంతవరకు వీడిపోదు కత్తుల ప్రహరీ నరజాతిని.

"నరులు వికారలోలురు. కాబట్టే కావాలొక
ధర్మధ్వజ ధర మనుజేశుడు. నీచం, నికృష్టం రాజనీతి.
అందుకనే రాజధర్మమతి ఘోరమైన భారం.

"ధర్మజా! మానవ మనో దౌర్బల్యం,
పిరికితనం సన్యాసం. జీవన పాశపు చిక్కులు
విడదీయుటయందే నిబిడమైంది నిజముగ మనుజత్వపు నిజరూపం.

"తానొక్కని సుఖ సముపార్జన కాజాల దసంభవం నరునకు.
కోటి కోటి మనుజుల సుఖభోగపు సాధనె కఠినం.

"–చాలించీ లోకపు ఊసె లీనం కా! నీలో నీవే!
శోధించుము నీకై మాత్రం ముక్తి!
సాధించుము సౌఖ్యం నీ కొరకే! ఇదొక తరహా మార్గం.

"ఇదిగో యిది వేరొక మార్గం. నీ వివేకం, విజ్ఞానం ఒరులకు
సైతం సమకూరిచి, అనేకులు నిన్ననరింప చేరుకొమ్ముదివి, భువిని వీడి.

"ఏ తపోబ లాధారంతో నిజ సుఖ సముపార్జన కారాటం పడసాగితా,
ఆ బలమే హరించగల దసంఖ్యాక జన సంతాపం.

"కేవల స్వార్థానికి నిజ తపస్యాపహరణం!... ఇదేనా మరి న్యాయం?
సమష్టి ముక్తి సాధించగ ఉచితోపాయ మిదేనా?

"యుధిష్ఠిరా! నా కాయుష్యం నా కారోగ్యం బని భావించకు!
వీక్షించు సమస్త విశ్వం. వీక్షించుము నీవలెనే శాంతి సుఖాల వాంఛిస్తూ
అహరహమూ తహతహ పడు ప్రతి నరునీ.

"నేనూ మన్నించెద; నీ వాంఛిత శాంతి నీకు
లభిస్తుంది వనిలో. ఐతే ఈ భువిలో
నీ అడుగుల జాడల కేం మిగిల్చి చనుచుంటివి?

"నిర్జన దేశంలో ఆర్జించవచ్చు బహాశా
నీ వొక తీరం. కానీ దగ్ధంబగు ధాత్రికి అభయం బెవరిత్తురు?

"ఈ సమస్త నర నారీ సముదాయం కొంపదీసి
స్వీకరించితే నీ ఆదర్శం'– ఇంకేమున్నది?
ఈ సృష్టి సమస్తం బిట లయమై విపినంలో వెలుస్తుంది.

"సమృద్ధ భూమి కాగలదు శ్మశానం. శూన్యం బగు నృప సదనం.
దేన్ని గాంచి మునులందరు గజగజ లాడెదరో
దానికి నక లౌతుం దరణ్యం.

"అట సైతం పురవాసుల త్రితాపాలు దహించ సాగిన
చేత బట్టి కమండలం, త్యజించి విపినం సైతం
పరుగిడ మొదలిడునా పరమయోగి?

"ధర్మజా! గేహం, విపినం త్యజించి కాదు
పలాయన మొనరించుట యతి.
జీవిత మంటే మాత్రం తప్పించుక తిరుగును నిత్యం

"కావాలాతని కెపుడూ తీయని పానీయం.
ఉప్పు కషాయం, చేదు విషం గిట్టవు మరి పాపం.
ఆర్జన జపం వినా అన్యం శూన్యం.
త్యాగంబను పలుకే అపరిచితం.

"విజయం బన పొంగును అపజయ మన క్రుంగును
ప్రగతి గాంచి పగలబడును పతనం గని రోదించును.

"మనలేడు తటస్థుడై. విసుగుకొనును; విలపించును.
అతిగా వ్యాకులపడు. తన చిత్తం వచ్చినట్లు
ఎందుకు రూపొందదు జీవితమని గగ్గోలొనరించును.

"కానీ జీవిత మొక సంస్కారిత మూసయందు
బంధిత మయ్యెను. తీరుగ వేరు వేరుగా
ఎవ్వరెవరి మూసలలో ద్రవించి, ప్రవహించాలీ
జీవిత సలిలం. "ఈ అరణ్య మీ పొదలను ఖండించిన ధీరుడె
సాధించును స్వీయ ఫథం. ఎవడో స్వంతం చేసుకొనగ
ఈ దని కా దెవరికి బానిస.

"యుధిష్ఠరా! జీవితమ వణకువారి సొత్తు కాదు జీవితం.
పూనికతో నిర్భీతిగ పొరాడెడివారి దది.

"సర్వ జనుల జిహ్వలనూ విముఖుల నొనరించును సంద్రం,
తన కషాయ లవణజలంతో. మందర పర్వతం ధరించి
మథించెడి నరులకు మాత్రం ప్రసాదించు నది సుధ.

"వృక్షారోహణ జరుపకనే అమృత ఫల భక్షణ మభిలషించు నరుడే,
మందరాద్రి భారం భరించకనె సుధారస పానానికి వ్యథ చెందెడి మానవుడే,

"అశేష సుధా, మధు, మణిమయ
రత్నాలతో విరాజిల్లు కోశాగారం కాల దన్ని– 'ఛీ! ఉప్పుకషాయ మీ'
జలమని నిందిస్తూ వర్జించును జీవన సంద్రం.

"జీవిత మన గిట్టక పలాయనం మొనరించెడి హేతువు
బహుశా యిది కావచ్చును- 'అనంత సౌఖ్యాగారం
ఎచ్చటనో వనిలో దాగిందని అతని మతం.

"అడుగిడగానే గడించి ఆ కోశం పొందవచ్చు సర్వస్వం.
గేహం త్యజించిన మరుక్షణమే పొందవచ్చు బొందెతొ కైలాసం.'

"జనులతొ క్రిక్కిరిసెడి జగం నుండి
వ్యాకులుడై వని కేగుట ధర్మజా! నిజమిది!
జీవన రణరంగంలో ఘోర పరాజయం నరజాతికి.

"ఘోర శోక మీ నిష్క్రియ తత్వం. మానహీన పలాయన క్రమం.
చప్పబడ్డ, పరాజిత, అమంగళ బుద్ధి భ్రమిది.

"మరి ఈ బుద్ధికి కోలాహల జోలి మాని
కండ్లు మూసి బైఠాయించుటలో కనుపించును కైలాసం.
మంటనుండి కాపాడెడి రక్షణ మార్గం నిర్లక్ష్యంగా
విడనాడుటలో వీక్షిస్తుందది మోక్షం.

"గాలికి సైతం హడలెడి నీ నిష్క్రియ తత్వం బెల్లపుడూ,
గుప్తపరుచు మెలకువగా, శక్తిహీన తపస్సును.
విసర్జించి జీవన రశ్మి ప్రకోపం సంచరించు ఛాయల్లో.

"కర్మ జగత్తు నుండొనర్చి పలాయనం
దూరంగా తనకొక గూడు కట్టుకొని
కేవల మూహలలో కనసాగును పగటి కలలు;
అసంభవ సంభవాలు.

"అంగుళీక ముద్రాశూన్యాలగు కలలవి.
మండే జీవనాగ్ని కణ రహితా లగు స్వప్నాలవి.

"ఆ స్వప్నభూమిలో- పూలు మాత్రమే వికసిస్తాయ్
ధూళీ, దుమ్మూ గాలించిన దొరుకదు.
తెలుసా! అట ఎటనైనా సరె మచ్చుకు దొరుకవు కంటకాలు.

"మధురాతి మధుర మా లోకం. కలికానికి శూన్యం కరుకుతనం.
లోహం సైతం ద్రవించి విరజిమ్ము సుధాకర ప్రభ.

"జీవన ప్రవాహ మట జోహుకు మను ఊహకు.
నరుని మనం మెచ్చెడి తలపు లన్ని ఫలియించును.

"తన మనంతొ తా వీక్షించెడి ఊహాజనిత జగాని కస్తిత్వం
బిట ఈ భువిలో ఎట నున్నదొ ప్రశ్నించా విరక్తుణ్ణి.

"ఎట లభిస్తుంది భువిలో కేవలం పూలబాట?
కంటకాలు గ్రుచ్చుకొనని పథ మెచ్చట భువిలో?

"ఏదీ పచ్చ పచ్చగా సదా ప్రఫుల్లితమై విలసిల్లెడి ఉద్యానం?
ఏదీ శ్రమధూళి శూన్య సభోమండల ఖండం?

"రణానికి ముఖం దాచి చిత్తగించి పలాయనం
దాగె నతడు చింతనలో. ఐతే హతమారిందా
దహ్యమాన దుఃఖం బీ మహిలో?

"కర్తవ్య నిర్వహణా కర్తవ్యం లేదా యిక ఆతనిపై
ఆర్జనతో కాకున్నా అడుక్కునైనా తన కడుపుకింత వేయదా మరి?

"కర్మభూమి సమస్త మహీతలం.
బొందెలోని ప్రాణం బొందెను విడనాడు వరకు
అంతవరకు అనివార్యం బాధ్యతా నిర్వహణం.
జీవన కణకణముతొ పెనవేసుక యున్నది కర్తవ్యం.

"కర్మ ధర్మ పరిత్యాగియై నరుడే విధి పొందును నిజ సౌఖ్యం?
నీడవంటి దీ కర్మ. కర్మతొ తెగద్రెంపులు చేసుక ఎట కేగును మనుజుడు?

ధర్మజా! కర్మనిష్ఠ మనుజుని మార్గం కాదది సన్యాసం.
నిత్యం నరుని నడక పుడమి పైని; కాదాకాశంలో.

"పశ్చాత్తప్త హృదితో నీ విప్పుడు గ్రహించునది కర్మత్యాగ పథం;
పలాయన మార్గం. దూర మొనర్చు నిన్నది జీవనధారకు.

"జ్యోతి సమాప్త మవటంలో ఏమున్నది మహిమ?
జీవితాని కేమున్నది శ్రేయం? మరింత జ్యోతిర్మయ మొనరించా దీపిక
భువన వ్యాప్త తిమిరం పోద్రోలుటె సద్ధర్మం.

"నిను భ్రాంతిలో ముంచెడి విరక్తి అది అత్యంత వ్యాధిగ్రస్తం,
అతి నిర్వీర్యం. నిష్క్రియ తత్తపు నీ దది. జ్ఞానం పేరిట మోసం.

"ధర్మజా! చిక్కకు! దక్కను దానికి. ముంచును నిన్నది చింతనలో.
నిండకుండుగా కీ జీవితాన భయానక సోమరితన ధూమం.

"అతి చంచల తరంగ సమ మీ యకర్మణ్య మేధోత్పన్న విరక్తి.
ఒక్కసారి లేచిందా తరంగం తిరిగి చేర దిక గేహం.
"అనిత్య మశాశ్వతం బని అని అని ఒనరించును జీవితాన్ని రుచిహీనంగా.
చిత్రిస్తుందది నిద్రను జాగృతిగా; తేల్చివేయు బ్రతుకునె మృతిగా.

"శూన్యంలో శోధించును అస్తిత్వం నష్టంలో దర్శించును లాభం.
అకర్మణ్య లోలత్వమె అత్యుత్తమ కార్య మనును.

"అందని పొందలేని వన్నీ సత్యాలీ విరక్తికి.
కర్మకు తలవంచెడి దృశ్య పదార్థ మంతా భావించును మిథ్యని.
"ఎల్లప్పుడు విలపిస్తూ పోషించును నిష్క్రియతను.
వైరాగ్యపు ముసుగుతొ నరికి నరికి కూలద్రోయు జీవన తరువును.

"సహించలేదేమాత్రం బిది కర్మ ధర్మ పూర్ణంబగు
కోలాహల విశ్వం. కాబట్టే చల్లార్పగ జూచును
ఎల్లప్పుడు, ఎల్ల విధుల ప్రజ్వలించు నరాంతర్గత అనలం.

"హరించును, హతమార్చును చుంబించెడి కుసుమాలలొ తొణికెడి
హహదానంద మందహాసం. నిరోధించు; నిర్మూలించును
చంచల హిమబిందు నిహిత ప్రగతిశీల జీవిత సంచలనం.

"ఈ పలాయన విహంగ హృదిలో శేషించదు శక్తియుక్త సంగీతం.
దీని మురలీస్వనంలో ఉత్తేజన పూజ్యం.

"ప్రవచిస్తుందది మొక్కలతో- పొందకండి వృద్ధి మీరు.
పెరుగుట విరుగుట కొరకే. ఆత్మహననమే
మహిమాన్విత మోక్షం. వాడిపోవుటే సుఖప్రదం.

" 'కాలుని బలివి నీవు తెలుసా?' అని వాపోవుచు పూర్ణంగా విచ్చిన
స్వస్థ, సురమ్య కుసుమానికి మరణ భీతి ప్రదర్శించి
రసభంగ మొనర్చును.

"శ్రీ, సౌందర్య, తేజో సుఖానికీ విరక్తి దూరుల నొనరించును నరులను.
దీనుల బలహీనుల జేయును మానవులను.

"నర ప్రాణనిహిత ఉత్సాహోత్తేజాలను మాత్రమే
హరించదీ విరక్తి. హరించు భుజ ప్రతాపం హతమార్చును శరతేజం.

"ధర్మజా! నిజం. 'అశాశ్వత మీ విశ్వం' ఈ మాత్రం తెలియని
దెవరోయ్? కాలగతికి లొంగని జన్మెత్తిన నరుడెవ్వడు?

"ఐతే నిజ మొక విషయం. క్షణ క్షణమూ నరుదనిత్య జపం సాగిస్తే
అనిత్య పదార్థం వినా నిత్యం బగు వస్తువు మచ్చుకు దొరకదు మానవునకు.

"దువిధలొ జిక్కిన నరుడేవిధి నిర్వర్తించును కర్మ దీక్ష దీక్షగ?
విశ్వ రణరంగంలో నరుడే విధి సాగించును సమరం సమర్థంగ?

"తిరస్కరించీ వర్తమాన జీవితోత్తేజం
అహర్నిశలు సాగించును అందరకూ జ్ఞాతంబగు మరణ జపం.
"నిష్క్రియ నిరర్థక పురుషుండెప్పుడు ఏమే లొనరించును
ఎవడికైన? ఏ పువ్వయినా మట్టిలొ వికసిస్తుందా?

"–అశాశ్వత మీ అవని సమస్తం ఈ శ్రమ భారంబంతా మిథ్యయె.
కుసుమం బెపుడైనా కాగలదా చిరంజీవి?–"
సదా అతనికిదే చింతన మది.

"త్యజించి ఈ లోకం, సాధించగ తన కమరత్వం
శోధించుచు సంచరించు యతి.
ఐనా ఏదో ఒక గడియన ఆతని సైతం తనలో
విలీన మొనర్చుకొను నా అజేయ 'అనిత్యం'.

"ఐనా అప్పుడు సైతం సాగును నిర్విఘ్నంగా లోక యాత్ర.
ఒక జ్యోతి వహించి మరో జ్యోతి భారం జ్వలించుచునే యుండును.

"వాడిన పూ రేకులు రాలును. వికసించును క్రొత్తపూలు.
శేషించును కొన్ని రెమ్మలో. తోడౌదురు మరి కొందరు
నవ పథికులు కొమ్మకు.

"కావచ్చు నకర్మణ్యుడు పండితుడుగ కా లేడమరుడు విలాపి మాత్రం.
కర్మభార వాహకుడైనందున క్షీణించదు ఆయువెవరికీ.

"యుధిష్ఠరా! మృత్తికపై హసిస్తాడొకడు. గగనంలో రోదిస్తాడింకొక్కడు;
ఇంత మాత్ర మంతర ముండుట నిస్సంశయ మిరువురిలో.

"వికసిత కమలాలలతొ పుడమితల్లి చెరగుల
తీర్చి దిద్దు నొక్కడు. ప్రయోగించి తన భుజబలం
నింపివేయు భూతలమంతా సౌందర్య సమృద్ధులతో.

"పుడమి అడుసు సహనంతో సహియిస్తూ, తాపత్రయ ధాటికి తట్టుకుంటు,
ఒకప్పుడు వెలుగుతోడ కులుకుచు, మరొకపుడు తిమిరంలో మునుగుచు,

"అగాధ పాతాళం బ్రద్దలొనర్చి ప్రవాహిత మొనరించును మృత్తినుండి
క్షీరం; గ్రోలును సారం; బజాయించు మానవతా విజయ నగారా!

"మరింత సొంపు గూర్చి లోకానికి విడనాడును ఈ పుడమిని.
అంతేనా! ఇపుడుండిన మజిలీ కాదని నడిపించును ముందుకు ధాత్రిని.
చేర్చు మరో నూతన మజిలీ. "ఇక రెండవవాడో!
కర్మశూన్య చింతన నూతగ గొని
శోధించుచు మోక్షం సంద్రంలో
తిరుగును వ్యర్థంగా తీరంలో.

"అహ రహమూ కష్టజీవు లొసగెడి ముష్ఠితొ
పోషిస్తూ తన కాయం ప్రకటించుకొనును
తన్ను తాను నిరాసక్త పురుషుడుగా.
ఈ సమస్త భువనం 'హేయం, నీచం' బని వాక్రుచ్చును.

"నిరంతరం ప్రబోధించు సాగించును తిరుగుడు–
'ఇదిగో! చూచారా! ఈ కనుపించెడి ప్రతిదీ మోసం.
అలభ్య, అదృశ్య అగోచరమైనది ఏదైతే ఉన్నదో
అది మాత్రమె వాస్తవం.

"ఈ కాయం, కర్మక్షేత్రం నిజంగానె మిథ్యైనట్లుగ.
మానవ సత్కర్మ ప్రభావం నిజంగానె మాయైనట్లుగ.

"కర్మవీడి మనుజుడు నిజంగానె సంస్కరింపబడగలడన్నట్లుగ,
అవని త్యజించి అంబరాన నిలబడగల డన్నట్లుగ,
"నిజానికి జన్మెత్తుటలోనే కల్మష మున్నట్లుగ, మోయలేని దుఃఖపు
భారం భుజాల కించుక తగ్గించుటె పాపం బయినట్లుగ,

"గంధ, రూప, రస, శబ్ద స్పర్శలు నిజంగానె పాతక మన్నట్లుగ,
త్వక్చక్షు శ్రోత్ర జిహ్వాఘ్రాణంబులు
మిత్రవరులు కానట్లుగ, ఘాతకు లైనట్లుగ,
"నిజమున కాత్మ హననమే ముక్తికి బా టన్నట్లుగ,
జీవించుటె నిజముగ జీవితమునకు బరువన్నట్లుగ,

"ఈ సృష్టి సమస్తం బేదో ఆకస్మిక ఘట నైనట్లుగ,
మనుజుని పుట్టుకకొక ఆశయమే లేనట్లుగ,
నిరంతరం ప్రబోధిస్తు సాగించును యతి సంచారం.

"ధర్మజా! నిజం! కాదీ ధరిత్రి చిరంజీవి. ఐతే యిది మన దోషం
కాదుగదా! ఏ నరుడూ రాలే దిట స్వీయ బుద్ధితో,
ఎవడైనా పంపబడినవాడే.

"మానవ సౌభాగ్యం బీ 'అస్తిర' మృత్తికలో నిహితం బవకుంటే,
చిత్రయోని సంజాతుండై మనుజుడు గగనంలో జన్మిస్తే,

"కిరణ రూపధరుడై, నిష్కామ చిత్తుడై,
క్షుధా, తృష్ణ వ్యాధుల కతీతుడై.
శ్రవణ నయన శూన్యుండై, చరణహీన, భుజహీన, దృష్టి విహీనుండై,
కర్మబంధ విముక్తుడైతే కావలసిందేముందిక?

"కానతి కర్కశ మీ మృత్తిక. ఆకలి పీడించును మనుజుని.
త్వక్కునుండి మానసం వర కనేకలాలసా, పిపాస లెల్లప్పుడూ అతని
మేల్కొల్పుచునే యుండును.

"ఈ ఆకలి దప్పులెప్పుడూ ఏమాత్రం, పోనీయవు నిద్దుర మానవుణ్ణి.
పురమాయించును మానసాన్ని చింతన దెస;
భుజ శక్తిని కర్మ దిశకు. "దేహానికి వశం కాని
కల్లబొల్లి స్వర్గం కన్నను మిన్నయైంది భుజబల ఫలం.

"కారణ మేమంటావా? భుజములు సాధించిన ప్రతిదీ ప్రాప్తించును
మనసుకు సైతం. వ్యర్థం కేవల ధ్యానం. భుజముల మాటటుంచు-
ఫలితం మనసుకు సైతం కాజాలదు లభ్యం.

"మనసును సైతం బానంద తరంగ డోలికలో నూగించెడి భుజములె
భుజములు. హస్త చిత్రలేఖన కసాధ్యం బవజాలని ధ్యానమె మరి ధ్యానం.

"-భుజాల దొక పథం, మేధస్సుది మరో పథం-
పొసగదు సమరసతాభావం బా ద్వంద్వగ్రస్త జీవికలో.

"కేవల జ్ఞానాధార నివృత్తి అది అసమర్థం దువిధను శిథిల మొనర్పగ.
జగం త్యజించినంత మాత్రానే అడుగంటదు మనోతృష్ణ.

"పోనీ; నరుడు త్యజించి వనిలో దాగుదమనుకుంటే,
వెలివారలు కారాయిరి మరి నర శత్రులు. ఎటకడుగిడితే అటనే
తయారు మానస పటలంలో.

"జగంనుండి విడివడి మునులు జయించెడి రిపులను
ధర్మజా! వంచగలవు ఈ జగత్తు నాత్మీయం చేసుక.

"ఆత్మ హనన మార్గంలో హఠయోగులు వధించి వధించి
శిథిల మొనర్చు మనస్సుపై - సంయమ బలివైన చాలు-
సజీవంగ స్వాధీనం సాధించెడి సమర్థుడవు.

"సన్యాసుల, విరాగుల కేనాడూ ప్రాప్తించని సౌఖ్యానికి
భాగస్వామి కాగలవీ లోకవాసివై సైతం.
"అసంఖ్యాక మనుజ కోటి కాప్తుండై వారి హర్షమే తన హర్షంగా,
వారి శోకమే తన శోకంగా, భావించ లభించు సౌఖ్యం బా సౌఖ్యం.

"వికలాంగుల పరిచర్యలొ కరముల సార్థక మొనరించు వేళ;
బలహీనుల, నిరుపేదల భారం తన భుజాలపై భరియించెడు తరి
వెల్లువలై పొంగిపొరలు మహదానందం బది.

"విపినం బొకటే కాదు పవిత్రం. వీక్షించీ విశాల విశ్వం!
చేయూతకు తపియిస్తూ అడుగడుగున యిడుములు బడు
అసంఖ్యాక దుఃఖితు లరుగో!

"అన్నం, వసనం, పానీయం వెనువెంటనె వారి కవసరం.
కావాలి వారి కాశాజ్యోతి. బలిష్ఠ కర చరణంబులు
వారి కవసరం. వారి కవసరం వాణి బలం.

"నీ కన్నులు పర్యాలోకించిన
మహత్తర దృశ్యం వీక్షించాలా దీనులు సైతం.
నీవు చేరుకొన్న ప్రస్థానంలో కావాలి వారికి సైతం స్థానం.

"ధర్మజా! ఏ తాపానల భీతికి జీవితమే త్యజించ బూనితొ,
తిలకించా తాపాగ్నిలొ దగ్ధంబగు సమస్త భువనం.

"సర్వరోగ నివారిణీ సన్యాసం బొకటే యైతే
గుప్తంగా నుంచకు తద్యుక్తిని. సర్వనరులు సంతప్తులే.
ఉపదేశించుము మోక్షమంత్ర మెల్లరకూ.

"పద! పద! చల్లార్చ మనుజ నిహిత రాగాలనలకీలల.
వర్షించు సుధారసం. అభిషేకించుము దగ్ధరాత్రి.

"సాధించిన సింహాసన స్వత్వం బలిపెట్టకు జనహీన వనానికి.
గుర్తించుము నిజ కర్తవ్యం. సాధించొకింత గుండె నిబ్బరం.

"వాడి శరాలకు గురియై భరత భూమి గాయపడని
అవయవమే శూన్యం. అసంఖ్యాక ప్రాణంబులు చేస్తున్నవి
'త్రాహి, త్రాహి' యని హాహాకారం.

"మహా కల్లోలం! అత్యంత భయానకం!
కనివిని ఎరుగని ఘోర విపత్తీ నాటిది.
నలుమూలల ఎటు గాంచిన ప్రత్యక్షం,
మృత్యు గహ్వరం గడిచి తపించెడి నరనారీ సముదాయం.

"త్యజించీ దీనుల విపినవాసివై పొందెడి శాంతేమిటి?
జీవుల సేవను కాదని ఎటుల వరించెద వా జడముల?
తుడిచెయ్ కంటినీరు! లే! పద మరి శరవేగంతో!
–విపినానికి కాదు సుమా!–

లోకానికి! వెలుగొందుము
అసేంఖ్యాక జన జీవన ఆశాజ్యోతివి గా!

"పిలుస్తోంది నిష్కామ కర్మ నిను. పిలుస్తున్నది గీత నీకు.
సమర భీత మహి ఆర్తనాద మల్లదిగో!

"ఈ ఆహత, పరిత్యక్త వసుధకు గ్రోలించాలి సుధారసం.
ఈ అనంత లతా సమూహంలో పూయించాలి తిరిగి పూలు.

"హరించాలి అనాధులౌ, అసంఖ్య జన అశ్రు నిహిత తాపం.
అగణిత విషాదగ్రస్త అధరంబుల మరలా చిందించాలి మందహాసం.

"ధర్మజా! మృతులపైని లేదిక బ్రతుకుకు అధికారం.
నిత్యం శేషిత జీవితులే వహించాలి భూతల భారం.

"దుర్యోధనుడు దొరిగిన మరుక్షణమే నీ పాలిట
పడె నీ భారం. ఎవరో మోయుట
కెవ్వరి దీ భారం? ఇంకెవరు భరియింతురు నీవు గాక?

"భరించు మీ భూభారం కర్మనిష్ఠ యతివై.
గగనంలో విహరించెడి నరుడార్జించెడి దేమిటి?

"పై నంతా శూన్యం, శూన్యం! ఆకాశం గగనం శూన్యం!
యుధిష్ఠరా! ఏదైనా ఉందంటే అది భువిలో మాత్రం; కేవలం జీవితంలో.

"సమతా విధాన పథికుండై సర్వస్వం పొందగలడు నరుడు.
అవని విజేత దెస స్వయముగ అంబరమే పయనించును.

మచ్చకు గురి గాకుండా భోగించుము స్వేచ్ఛగా భువి.
ావాలి విలీనం -మృత్తికలో నీవు కాదు; మృత్తిక నీలో.

"ఉపదేశించు మిదే విధి ప్రతి నరునకు భోగ పథం.
కావాలి విలీనం మనసున దేహం; కాదు మనసు దేహంలో.

"మనుజుని దేహంపై అధికారం మనసుకు ప్రాప్తించినపుడు,
భోగ లిప్త జీవనాధిపత్యం త్యాగం వహియించిన రోజున,

"స్వర్ణం నరునకు సాధన మాత్రంబేనని, సాధ్యం కారాదని
గుర్తించిన రోజున, నరులంతా సరిసములని మనుజుడు గుర్తించిన రోజున,

"కాషాయం, మకుటం రెండిటికీ జిక్కని మనుజుని,
సమస్త తత్వాతీతుండగు అంతరంగ సత్పురుషుని.

"నిర్మల విజ్ఞాన బలంతో కన్నులార కనుగొని, నరుడెన్నడతని
పొందునొ, మకుటం, కాషాయలలొ దృష్టెన్నడు చిక్కువడదొ-

"ఆ దినమే, ఆ క్షణమే మానవ సౌభాగ్య మహోజ్వల
సురమ్య సుప్రభాతం. ఘోషించును ఆ దినాన
అఖండ మానవ జయ శంఖధ్వానం.

"ధర్మజా! ధ్యేయం కాదు సమీపం! చేదుకు మరి ఆలశ్యం.
ఈ పథాప నరజాతిని నడిపించుము ముందుకు!

నిజం! మహాపాపి మానదుడు. వధిస్తాడు సాటి నరుల.
ఐతే మరువకు మిది మాత్రం. నరుని కొరకు నరుడే చేస్తున్నా డాత్మార్పణ!

"లోభం, ద్రోహం, ప్రతీకారం, వైరం బాదిగ గల అసంఖ్య
అవరోదాలున్నవి. మానవతకు; నిజమే! ఐతే నేం! తపస్సు,
బలిదానం త్యాగాదులు సైతం బున్నవి ప్రతిగా అపరిమితంగా.

"నీ చరిత్ర బలంతో ప్రసాదించు ఉత్తేజం సాటి జనానికి.
నీ తపో మహిమతో నింపుము పుణ్య కాంతి ప్రజలో.

"తలపోయకు మొల్లప్పుడు మనుజుడు పాప నిరతుడని.
పాపం! పాపానంతర మతడే నెత్తి నోరు కొట్టుకొనును పశ్చాత్తాపంతో.

"ఈ ఆక్రందన, అశ్రుల పైనే కొండం తాశలు నరునకు.
ఇంకా జీవిచే ఉన్నది మానవత్వ మన గల్గుట కిది రుజువు.

"పాతక జ్వాలల్లో హతమారును మానవుడనటం కాదది సత్యం.
సత్తువ చేకూర్చుక తిరిగి పురోగమించు నరుడనుట యథార్థం.

"జగత్తు కాధారం పుణ్యవ్రతుని వెలుగే కాదు;
ఘోర తిమిర నిహితం బగు కిరణం సైతం బాశయె ధరణికి.

"–'పూవులపై అశ్రుముత్యాలు; అశ్రుల్లో ఆశలు'–
ఇదీ పుడమిపైని బ్రతుకుకు మేటి సూటి నిర్వచనం.

"ధర్మజా! వెలిగించి పురోగమించాశాజ్యోతి.
విముక్తి కాగల దవశ్యమొక దిన మీ భువి రణభీతినుండి.
మానవ భావాలిక కాబోవిక లాలసాగ్రస్తం.
అవినీతికి బానిస కాదిక జీవితం. పరాజితుడైనతంతనె,
క్షీణించదు నరుని మహాత్మ్యం. విజయుడైన మాత్రానే
ప్రజ్వరిలదు నర తేజం. స్నేహం, బలిదానం మాత్రమె
గీటురాయిగా వెలయును మానవతకు.
మాన వానురాగం పునాదిగా స్వర్గలోక మగు నీ భూలోకం!"



శ్రీ 'దినకర్'



శ్రీ చావలి రామచంద్రరావు

## తెలుగులో

# కురుక్షేత్ర కావ్యం

శ్రీ రామ్‌ధారీ సింహ్ 'దినకర్' ఆధునిక హిందీ కవితాలోకంలో అగ్రగణ్యులు. 1908లో జన్మించారు. ఎమ్.ఏ. పాసయి అనేక ఉద్యోగాలు, అనేక గౌరవ పదవులూ నిర్వహించారు. ప్రపంచ శాంతి గురించిన ఆకాంక్షతో కురుక్షేత్ర మహాకావ్యం రచించారు. రేణుక, హుంకార్, రసవంతి, ద్వంద్వగీత్, రశ్మిరథి, ప్రభృతి గ్రంథాలెన్నో ప్రచురించారు. ప్రభుత్వం వీరిని పద్మభూషణ్ బిరుదుతో అలంకరించింది. ఊర్వశి అనే మహాకావ్యానికి జ్ఞానపీఠ్ అవార్డు లభించింది.

**శ్రీ చావలి రామచంద్రరావు** ఆబాల్యాదిగా కమ్యూనిస్టు కార్యకర్తగా పని చేసినవారు. ఉపాధ్యాయ ఉద్యమంలో ఇరవై ఐదు సంవత్సరాలు కృషి చేశారు. క్విట్ ఇండియా ఉద్యమంలో ఆరు నెలలు జైలుశిక్ష అనుభవించారు. హిందీ పండితునిగా ఇరవైఐదు వత్సరాలు నెల్లూరు, ప్రకాశం జిల్లా హైస్కూళ్ళల్లో పని చేశారు. 1926లో ఫిబ్రవరిలో జన్మించిన వీరు ప్రస్తుతం (ఆత్మానంద నిలయ వృద్ధాశ్రమం పిట్టలవాని పాలెంలో) విశ్రాంతి తీసుకుంటున్నారు. వీరు ముక్తచ్ఛంద కావ్యంగా అనువదించిన కురుక్షేత్రం 1958లో (అక్టోబరులో) విశాలాంధ్ర ప్రచురణాలయం విజయవాడ వారి ప్రచురణగా వెలువడింది. 'సమతారావు' అనే కలంపేరుతో బాలసాహిత్యం విరివిగా పండించారు.